155
మార్చి
1994

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

## డంకెల్

అతని శరీరం అంత పెద్దదేమీ కాదు,
అయినా ఆకాశమెత్తు పరుపు మీద నిద్రపోతుంది
అతని కాళ్ళు అంత పొడుగేమీ లేవు,
అయినా అమెరికాలో నిలబడి ఆఫ్రికాను తంతుంటాయి
అతని చూపు అంత దూరమేం పోదు,
కానీ ఆసియా యాపిల్స్‌పై నిప్పులు కక్కుతుంది
అతని చెవులు ఏనుగంత పెద్దగా లేవు,
కానీ ఆటంబాంబు శబ్దాలను ఆకాశవాణి వార్తల్లా
వింటుంటాయి
అతని నోరు చూస్తే అరటిపండు కూడా పట్టదు,
కానీ అవలీలగా, భూగోళాన్ని మింగుతుంది

—శీను

విప్లవ రచయితల సంఘం

౨

# విషయసూచిక




విరసం కార్యదర్శి :
జి. కళ్యాణరావు
అలకూరపాడు (Po)
టంగుటూరు (మండలం)
ప్రకాశం జిల్లా

'అరుణతార' వర్కింగ్ ఎడిటర్
వి. చెంచయ్య
6-5-13
కావలి-524 201
నెల్లూరు జిల్లా



రచనలు, చందాలు వర్కింగ్ ఎడిటర్ అడ్రసుకు పంపాలి

 

# కవిత

## స్వేచ్ఛగా

దేశం వెన్నెముకని
డంకెల్ పిచ్చికుక్క నాకింది!
'సొల్లు'ను నూనెగా
మన కళ్ళని వేపుకుతినే మల్లుబున్నారు కదా!
మనకేం డోకా లేదిక్కడ....!
గుంజండి! మన గుడిసెపై మువ్వన్నెల జెండా!
లోపభూయిష్ఠ పర్యావరణంతో
కావరాని వర్షం కోసం
కడుబ్బట్టుకొని నిల్చున్నాం కదా!
ఇక 'స్వేచ్ఛ'గా ఏడువ్వచ్చు!
హక్కులు ఆత్మహత్యలయ్యేదాకా—
రాజ్యం అంగం పవి చేయడం
ఇవ్వాళ్నే ప్రారంభించిందనుకోకు
తొక్క తొక్క ఏ తెల్లవారు
మన ముంగిలి పొక్కిలి గాకుంటుందని?
సేద్యపు తొలినాళ్ళ నుంచి
తెగులు లేకుండా బతుకలేనివాళ్ళం!
మన రుమాలు పొట్టు పొట్టయ్యింది!
మన కోలా — పొల్లు పొల్లయ్యింది!
అధికారమిచ్చి
అమాయక మయిన్నాన్నుంచి
మన ఒళ్ళు దుక్కిలి దుక్కలే!
అయ్యా! నాయినా!....
ఇపుడు మిగిలిందేమిటి?
అన్నా! తమ్మీ!....
ఇపుడేమ్మిగిలిండని??
బద్దకం విడిచి ములుగర్ర చరచి
"జా!" అంటమే—

—చైతన్యప్రకాశ్

# అభాగ్యజీవుల భాగ్యయుగానికి...

మృత్యువు కల్పించే వ్యాపకాల్లో పూరించుకోవాల్సిందే తప్ప
మృత్యువెంత అవ్యక్త శూన్యాన్ని హఠాత్తుగా సృష్టిస్తుందో
ప్రేమ తొణికిసలాడే మెరిసేకళ్ళు అదృశ్యమవుతాయి
అంట్లుతోమి అన్నంవండి అయినవాళ్ళవే కావు కానివాళ్ళవీ
రోగులవీ ఉచ్చబట్టలూ పీతిగుడ్డలూ ఉతికి
సేవలు చేసి సేదదీర్చి
బలాత్కారాలను అసహ్యంతో తోసేసి
మందులూ ఇంజక్షన్లూ యిచ్చి
జెండాలు పట్టి పిడికిళ్ళు బిగించి జైకొట్టి
పునర్నవించిన జీవితంలో ఆయుధాన చేర్చుకొని
తుపాకిపట్టిన చేతులు నిశ్చేతనమైపోతాయి
కలసినపుడు గలగల ప్రవహించే మాటలు
ఇంకెప్పుడూ జ్ఞాపకాల్లో తప్ప గాలిలోనూ వినిపించవు
ఇవన్నీ రోజూ పోగొట్టుకుంటున్నామని కాదు
పిల్లా పాపా కలవని ఎవరిపనుల ఒత్తిళ్ళ వాళ్ళవే
కాని ఆ తండ్రి రోదించినట్లు ఎవిమిదేళ్ళో
ఆ తల్లి ఆశ దాచుకున్నట్లు పదహారేళ్ళో
మీరు బతికివున్నారనేకాదు
మీరు ప్రజలకోసం పోరాడుతూ సజీవంగా వున్నారన్న
సన్నిహిత గర్వానికీ
ఇంక లేరన్న ఇవ్వాటి కఠోర సత్యానికీ మధ్యన
ఎడమెంత ?
మింగనూ లేని కక్కనూ లేని అనుబంధాలు
కడుపులో పేగుల్ని నులిపెట్టినట్లు
నరాల ట్రాన్స్‌ఫార్మర్లు పేలినట్లు
మనసొక్కటే కాదు మనిషంతా నిద్రరాని

ఒక సిరిమంట
ఎంత అనామకంగా వచ్చి ఎంత అరిందాగా ఎదిగిపోయావు
అయినా చరిత్రలో
అవ్యక్తంగానే ఒక నీడగానే మిగిలిపోతావేమో
మా ఇంట్లోకి అచ్చంగా ఒక నర్సులానే వచ్చావు
బిడ్డనూ చెల్లెనూ అక్కనూ స్నేహానివీ అయి
నువు లేకపోతే ఇల్లు చిన్నబోయేలా చేసావు
రాసినాయన కలంలోని నెత్తురు
ఆయన హృదయంలోంచి ఎంత పొంగిందీ కాని
అభాగ్యజీవుల భాగ్యయుగానికి పిలిచిన
సుత్తీకొడవలి జెండాను
గుండెలకు హత్తుకొని వెళ్ళిపోయావు
అక్కడన్నీ అడుగడుగునా అద్భుతాలే అనికాదు
అక్కడా మనుషులున్నారు
రోజులా నెలలా గడిచినా మాట్లాడే మనుషులుండరు
విప్లవ దాంపత్యాల్లో ఉద్విగ్న కలయికలకన్నా
ఉసూరుమనే ఒంటరితనాలు ఎక్కువ
పనులు సరే ప్రజాసేవలోని రిస్కువల్ల
ఛాలెంజింగ్‌గా వుంటాయి
కానీ చెక్కులోని జాగ్రత్త నియంత్రించే
మనం అయ్యీకాని జీవితాల్లోని ఏకాంతాలు
ఎవరికీ చెప్పుకోరానివి
విప్లవం మీద గురి ఒక్కటే
విరువకుండా మనవెంట వుండేది
నా దాకా రాకుండా నువు చెప్పిన ఎన్ని అనుభవాలు
చరిత్ర నిర్మించే అచారిత్రక వ్యక్తుల
అవ్యక్త కళాఖండాలుగానే కాలగర్భంలో కలిసిపోతాయో

మన స్వభావాల వల్ల మనం మనగురించే కాదు
మనసైన వాళ్ళ గురించీ కలలుకంటాం
మనవల్ల అవుతుందా లేదా అనికాకుండా వాళ్ళభవిష్యత్తుకి
మన ఊహల్లోనూ చర్యల్లోనూ రూపమిస్తాం
మేమేం ప్రయత్నించనే లేదు
నా జీవితం అట్లా మేం కోరుకున్న సాఫల్యంలో మళ్ళీ వికసించింది
నీకు ఎనిమిదేళ్ళే అసలు జీవితం
మాకు ఎప్పుడో తప్ప తాకని ఒక వెచ్చటి గాలి స్పర్శ
ఆ గాలి ఎన్ని అనుభూతుల్ని మోసిందో
ఎన్ని నిట్టూర్పుల్ని మోసిందో
ఎన్ని అనుభవాల్ని పూసిందో మేమెన్నడూ అడుగలేదు
మాకు
మీరు ఒక సాహచర్యంలో
ఎక్కువగా ఎవరికివాళ్ళు ఒక ఉమ్మడి ఉద్యమంలో
మగ్నమై ఉన్నారన్న భరోసాతప్ప
ఇప్పటికిప్పుడు మీకు కడపటి వీడ్కోలు చెప్పి
ఇల్లు ఖాళీ అయిందని కాదు
ఈ ఇంట్లో మీరున్నదీ లేదు
కొన్ని అనుబంధాల్లో కలిసిన సమయాలు తక్కువ
కనిపించని ప్రభావాలు ఎక్కువ
ఒక రాత్రంతా
నువ్వెట్లా తట్టుకుంటావీ వార్తను
మేమెట్లా నిను ఓదార్చాలి అనే అవేదనే
దూర నిస్తంత్రి నీ దుఃఖంలో తడిసి మను చేరుతుందని
వానమబ్బులా ఎన్నడో ఒకనాడు వచ్చి
ఒళ్ళోవాలి భోరుమంటావని....
కాని ఉదయమే ఒక ఒరిగిపోయిన చిరునవ్వు పక్కన

బతికుండగా అరుదైన ఆకాంక్షవలె నీ శాశ్వత ప్రశాంతనిద్ర
మీరిద్దరూ పోరాటంలో కలిసి అమరులయ్యారు
మృత్యువులోనూ ఒక ఊరట వుంటుందా....!

* * *

ఒక్కసారి రెండు చేతులూ తెగిపోయినట్లు
వంతెనా దానికింది ప్రవాహమూ అదృశ్యమయినట్లు
ఇపుడింక పలకరింపులూ లేవు సందేశాలూ లేవు
ఇన్నేళ్ళ గాథ పరిచయానికి గుర్తుగా నేనేమై మిగిలిపోతానోగానీ
ప్రేమ లేఖలయితే దాచుకోగలం
భావకవుల్లా చెప్పుకోనూగలం
కానీ వెలుగువంటి విప్లవోద్యమ వ్యక్తీకరణ నిర్మాణమంతా
వ్యక్తులమధ్యన ఒక అవ్యక్త వెన్నెల
మనకూ తెలుసు బహుశా అందరికీ తెలుసు
మనం బతికుండగా చెప్పుకోలేం అంతే
అందువల్ల బావురుమని
అమరత్వం బరువు దించుకోనూ లేము అంతే
అందుకే పోరాటాలు మానని గాయాలే కాదు
మనం చెప్పుకోలేని గాయాలు కూడ
మనను కన్నీళ్ళతో కలలతో జీవశక్తితో నడిపించే ధ్యేయాలు
ఒక సాగర కెరటం ఓరుగల్లును చెలియలికట్టను చేసుకున్నది
ఎంత సముద్రంలో ఎగసీ ఇక్కడి మట్టిలోనే కలిసిపోయింది
ఆ మంటల అడుగున మట్టిలో మీ అస్థికలు అలసిపోవు
ఆసుపత్రుల పోస్ట్‌మార్టమ్‌లు అబద్ధమై
అవాసాలు శ్మశానాలవుతున్న సంక్షోభం నుంచి
దహనమవుతున్న స్వప్నాలు సత్యాలుగా చిగురించే సమయం
ఆసన్నమౌతోంది.

—మనస్వి

# స్త్రీ విముక్తి

ఆరిన బ్రతుకు వాడిన బ్రతుకు
తరాలు గడిచినా సంకెళ్ళు తప్పలేదు
రాతలు నేర్చినా తలరాతలు మారలేదు
మగాడు మనస్సును వదిలి
ఒంటికి మొగుడైనాడు
మగ పెత్తన అహంకారంతో
పడుచులను చెరచి
చెడిపోయారని ప్రచారం చేసి
వంచనతో వశం చేసుకొని
వయస్సు కాకలో పెళ్ళిమంత్రం జపించి
కన్యత్వం చెడగొట్టి కాటికి దారి చూపించి
పెద్దలు ఎదలపై బరువు దించుకోడానికి
మానవత్వపు హద్దులు దాటి
లక్షలతో బేరమాడి
మనస్సుకు తెలియనివాడితో కట్టబెట్టి
సంసార బద్ధంగా వ్యభిచరింప చేసి
స్త్రీ ఒంటి బట్టలు ఒల్చి
నగ్నత్వాన్ని నైపుణ్యంతో మలచి
తమ లాభాలకు పెట్టుబడిగా చేర్చి
నైతిక విలువలు ఎండమావులుగా మార్చి
శృంగార కవిత్వంతో స్త్రీని వర్ణించి
సమాజాన్ని ఊగించి ఉడికించి
పడుచులపై పశువుల దాడికి పురికొల్పి
ఆదిశక్తిగా పొగడుతూ
పతివ్రతగా కీర్తిస్తూ
భర్త ఎలాంటి వాడైనా
భరించటమే కర్తవ్యమని
బోధిస్తూ ఉక్కు చట్రంలో
బంధించే బద్మాష్‌లు !
సోమరులు సృష్టించిన పురాణ స్వర్గంలో
పుణ్యం పేరిట రంభలను ఆశ చూపించి

ఇంద్ర సభలను సంభ్రమంగా నడిపి
సొమ్ము చేసుకొనే భావ దరిద్రులు !
కటిక దరిద్రంలో మగ్గుతున్న
అనాథ అబలలను
బలవంతంగా అనుభవించే
నిక్కి నీల్గుతున్న దొరబాబులకు
కుల పట్టింపు అడ్డురాలేదు మరి !
మహిళోద్ధరణ పేరిట
నయవంచనతో నల్గురిని ప్రశ్నించి
చాటుమాటున మేకవన్నెపులి
దిక్కులేని లేడిపైబడి భక్షించి
విష సంస్కృతిచే
పురుష అహంకారాన్ని పోషిస్తూ
స్త్రీని అణచి తమ పబ్బం
గడిపే పురుష పుంగవులు !
ఎక్కడ మరెక్కడ స్త్రీకి న్యాయం ?
జన్మనిచ్చే స్త్రీ సర్వ దోపిడికి గురి
లాలించే తల్లిగా, అభిమానించే చెల్లిగా
అనురాగం అందించే నేస్తంగా
ఆప్యాయతను పండించే ఇల్లాలిగా
రణరంగంలో ఫిరంగిలా
సమస్తంలో సగం స్త్రీ
జీవిత బాట గుర్తింపులో
రవ్వంత స్థానం వనితకు శూన్యం
దోపిడీవర్గ లాభాపేక్షే
స్త్రీసర్వ దోపిడికి మూలం
స్త్రీ శక్తి పురుషశక్తి బంధనమై
బందిపోట్ల సమాజంపై
ధ్వంసం చేయందే
స్త్రీజాతికి విముక్తి లేదు
పురుషజాతికి విముక్తి లేదు

—స్పందన

# "గొంతు నులిమేయబడ్డ గోగుపువ్వు"

ఈ మట్టిని దొలుచుకొని పుట్టిన మానవ వృక్షాన్ని నేను!
గోగు మొక్కని నేను !!
చెమట చేలల్లో చేపపిల్లలా ఈదులాడి
రైతన్నల చేతుల్లో ఎదిగి ఒదిగినదాన్ని
ఎర్రని కుంకుమ వర్ణం తొడుక్కొని ఎంకిలా ఎదకింత ఊరటిచ్చినదాన్ని
తనువు ముగిసి, మట్టితో పేగు తెంపుకొని
నీటిలో నిమజ్జనమైనదాన్ని
ఊరి ఊరి ఊరైనదాన్ని, నారి నారి నారైనదాన్ని
ఒంటిని వొలుచుకొని వస్త్రమైన దాన్ని
ఎండ ఎదమీద ఒదిగిపోతే
చిత్కొట్టి చిత్రిక పట్టితే పుట్టిన సొగసైన వెండి జలతారుని
చేవగల వాళ్ళ చేతుల్లో ప్రాణం తొడుక్కున్న సంచిని ! గోనెసంచిని ! !
కాని, నాకు నేనే ఏమీకాలేనిదాన్ని
నాకై దప్పికైనా తీర్చుకోలేనిదాన్ని
దుప్పటైనా కాలేనిదాన్ని
కడకు నా ఇంటిముంగిట కాళ్ళ పట్టైనా కాలేకపోయిన పరాయి సరుకుని !
నేను 'గోవింద శారద' గోడౌన్లు నింపే గోనెసంచిని ? గోడు సంచిని !!
సగభాగమయిన 'శివుని' ఆసనం కింద పరుచుకున్న మానవ కళేబరాన్ని ?
జపమాల చేతుల్లో ఉరితాడై నాకు నేనే నలిగి పెనవేసుకున్నదాన్ని
నేను జూట్‌ని ! బిడాబాబుల సూట్‌ని !
అయిదేళ్ళ అసెంబ్లీ ఎలక్షన్లకి రెండేళ్ళ మూతపడ్డ మిల్లుని
పిల్లల అస్థిపంజరాల సమాధి పొయ్యిల ఇల్లుని
209 రోజులుగా కడుపుకింత లాకౌట్ కణితపుట్టి
తుప్పు పట్టిన ఆకలిపేగుల గొట్టాన్ని
మిల్లు ముఖద్వారాలకు అల్లుకున్న సాలెగూడుని
కంఠనాళాలు తెగిన మిల్లు సైరన్ని !

నమ్ముకున్న రెక్కల్నే నరికిపారేస్తే
నడిరోడ్డుమీద దేకుకుంటున్న ఆకలియాత్రని
మైకులూ టెంట్లూ జెండా గుడ్డలూ లేకపోయినా
పట్టెడన్నం లేని ప్రతి ఇంటా నిల్చిన నిరాహారదీక్ష శిబిరాన్ని
పుట్టిన గడ్డమీదే వలస వెతుక్కుంటున్నదాన్ని
ఘెరావై ....బంద్దై .... జీవించే హక్కు కోసం జైళ్ళపడ్డదాన్ని
రైలురోకోలకి రాస్తారోకోలకి రహదారి అయినదాన్ని
అసెంబ్లీ వరకూ తిరిగి అరిగిన చెప్పుని
నేను ఢిల్లీ కోటపై ఎగరాల్సిన నల్లజెండాని !
నేనిప్పుడు గొంతు నులిమేయబడ్డ గోగుపువ్వుని !
చిట్లిన చెమటలోంచి జారే నెత్తుటి చుక్కని ! !
పదహారేళ్ళు గడిచినా పర్మినెంటుకాని 'బదిలీ' కార్మికున్ని
ఉద్యోగ విరమణ చేసి ఏళ్ళకి ఏళ్ళు గడచినా
జీవిత భద్రతనీ భవిష్యత్తునీ కోల్పోయినా
మృత్యువు వెకలించే వరకూ శ్రమని అందించే పుట్టు బానిసని
రోజు కూలీలో రోజుకి అయిదురూపాయలు అప్పిచ్చే ఓనర్ కాని క్లీనర్‌ని !
పద్నాలుగుకోట్ల బకాయిలూ
రొండొందలరవై కేసులూ, అరవై వారెంట్లూ వున్నా
అరెస్టుకాని అధిపతుల ముందు
లాకౌట్ నిషేధపు చెల్లని ఉత్తర్వుల 'జీవో'ని !
అయినా రక్తం రుచిమరిగిన పులులు
రాజ్యం చేతిలో పులులై నా దేహాన్ని చెక్కుతుంటే
నెల్లిమర్లలో నెత్తుటి యేరు వయాను
10 07.1974 నాటి గతాన్ని !
29-01-1994 నాటి వర్తమానాన్ని !
తెగిపడ్డ అంగాల కేలండర్లో వెతికే అంకెని
నేనే మృతుల సంఖ్యని ! పబ్లిక్ ఎన్‌కౌంటర్ని ! !
నేనిప్పుడు అనాథని ! ఆకలిని ! !
శ్మశాన శాంతిని నెలకొల్పిన నేతలారా
నేనిప్పుడు తుఫాన్ ముందరి అల్పపీడనాన్ని
నెత్తుటి బిడ్డనే అయినా నేనిప్పుడు పోరుబిడ్డని !



ప్రతిస్పందన :

# అంతర్జాతీయ మహిళా దినం వర్ధిల్లాలి!
# పోరాటం తప్పినా వేధింపులు తప్పలేదు

సమాజంలో స్త్రీకి ఒక ప్రత్యేక స్థానము, గుర్తింపు ఉంది. ఉంటుంది- దానికి ఏమాత్రం భంగం కలిగినా అనివార్యంగా స్త్రీ ఉద్యమాలు తలెత్తుతున్నాయి.

నేడు కొనసాగుతున్న దండకారణ్య ఉద్యమంలో గత 14 ఏళ్ళనుండి మహిళలు మరీ తెగించి పోరాడుతున్నారు. నేడు 1/3 వంతు మహిళలు దండకారణ్య ఉద్యమంలో కొనసాగుతున్నారు. దళసుల కొద్దీ మహిళలు ప్రత్యక్షంగా యుద్ధ రంగంలో సాయుధులై నిలచి ఉన్నారు. వేలాదిమంది మహిళలకు ఆదర్శమూర్తులై 'స్త్రీ విముక్తి' ఉద్యమంలో కొత్త చరిత్రలు సృష్టిస్తున్నారు. స్పష్టమైన విప్లవ రాజకీయాలతో 'క్రాంతికారి ఆదివాసీ మహిళా సంఘం' ఏర్పర్చుకొని గూడెం, గూడెం కదలిస్తూ గుండె గుండెను తాకుతూ అడవి తల్లి కడుపులో తలదాచుకుంటూ, అమరత్వాన్ని ప్రేమిస్తూ పోరుశంఖం ఊదుతున్నారు. నిత్య నిర్బంధంలో అడుగడుగునా మృత్యువుతో పోరాడుతూ గుండె గుండెల్ని స్పృశిస్తున్న మహిళల కృషికి విస్తరిస్తున్న విప్లవోద్యమమే గొప్ప నిదర్శనం- అసమాన త్యాగాలతో పురోగమిస్తున్న దండకారణ్య గిరిజన రైతాంగ ఉద్యమాన్ని అణచడానికి పాలకవర్గాలు కంకణం కట్టుకున్నాయి.

పాలక × పాలిత వర్గాల మధ్య ఈ సంఘర్షణ జరగక తప్పదు - ఈ యుద్ధంలో అభివృద్ధి శక్తుల విజయమూ తప్పదు - అయితే, తాత్కాలిక కష్టాలు, నిర్బంధాలు, అసత్య ఆరోపణలు అన్నీ యుద్ధ నీతిలో భాగంగానే కొనసాగుతుంటాయి కూడా. పాలితులు బలహీనంగా ఉన్నంత కాలం పాలకవర్గాలు మరీ కర్కశంగా దాడి చేస్తూనే ఉంటాయి. అణచివేస్తూ ఓటమికి గురి చేయాలని హోరాహోరిగా ప్రయత్నం చేస్తుంటాయి. అనాదిగా జరుగుతుంది కూడా ఇదే- ఏ దేశ చరిత్ర చూసినా అధికారంకై జరిగే ఒక మహా సంగ్రామంలో రెండు వర్గాల మధ్య సాగే యుద్ధం ఎంతో భయంకరంగా తయారై లక్షలాది ప్రజల కన్నీళ్ళ నెత్తుటి తర్పణతోనే విజయాలను వరిస్తూ వస్తుందని వర్తమాన, భూత చరిత్రలు నిరూపిస్తున్నాయి.

ఈ మహాసంగ్రామంలో ఎదుటి పక్షాన్ని ఓడించడానికి ప్రత్యక్ష యుద్ధ రంగంలో అమీతుమీ తేల్చుకోవడం అంతిమ గెలుపు - ఓటములతో ముడివేయబడి ఉండగా అందుకై బలగాలను కూడగట్టుకునే వ్యూహంలో ఇరుపక్షాలు అనుసరించే ఎత్తుగడలు ఆ వ్యూహానికి లోబడే ఉంటాయి. అశేష జన సామాన్యాన్ని కూడదీసుకుంటూ, దీర్ఘకాల విప్లవ వ్యూహంతో విప్లవ బలగాలు అనుసరించే న్యాయమైన యుద్ధాల్ని పాలకవర్గాలు కొనఊపిరి ఉన్నంతవరకు ఎదుర్కొంటాయనీ, అందుకు ఎంత నీచమైన (!) ఎత్తుగడలనైనా అనుసరిస్తాయనీ చరిత్ర నిరూపిస్తుంది. పాలక వర్గాలు పీడిత ప్రజలపై మరీ దారుణంగా దాడి చేస్తాయనీ, ప్రజల్ని భయభ్రాంతులను చేస్తాయనీ కూడా నేటి దండకారణ్య ఉద్యమం తాజా ఉదాహరణగా కనబడుతుంది.

నేడు దండకారణ్య ఉద్యమాల్ని అణచడానికి శ్రీకాకుళ-నక్సల్బరి-తెలంగాణా వీర రైతాంగ పోరాటాలను అణచివేసిన అధికార యంత్రాంగం ముప్పేటలా దాడి చేస్తుంది. తన ప్రచార యంత్రాంగాన్ని ముమ్మరం చేసింది ఈ రంగంలో 'స్త్రీ'ని పోలీసులు ఒక కీలకమైన శక్తిగా వాడుకుంటున్నారు. చాణక్యనీతిలో 'విషకన్య'లా నేడు పోలీసు 'దొర'ల నీతిలో స్త్రీ బలిపశువు అవుతుంది.

స్త్రీని ఈ సమాజంలో ఒక నాజూకైన, సున్నితమైన అంతకన్నా పవిత్ర మైనదిగా చూస్తారు. స్త్రీకి అన్యాయం జరిగిందన్నా, స్త్రీకి అవమానం జరిగిందన్నా, స్త్రీకి నష్టం వాటిల్లిందన్నా సమాజంలోని సగటు మనిషి విలవిలలాడుతారు. భూస్వాముల గడీలల్లో స్త్రీ బంధించబడిననాడు మనిషి వెక్కి వెక్కి ఏడ్చారు. పోలీసు లాకప్పులో స్త్రీ మానభంగం జరిగిందన్ననాడు మనిషి పదిమందిలోకి వచ్చారు. నడిబజారులో స్త్రీని అవమానించిననాడు మనిషికి 'పగ' రగిలింది. ఆ మనిషికి విప్లవ రాజకీయాలు తోడైననాడు గడీల్లో నుండి మహిళ బజారుకొచ్చింది. దొరల - దొరసానుల గుండెల్లో నిద్దురబోయింది- గడీలు కూలిపోయాయి. పల్లెలు వల్లకాడులవుతున్న దొరల-దొరసానుల నాడి చల్లబడడం లేదు. విప్లవోద్యమం, పౌరహక్కుల ఉద్యమాలు బలం పుంజుకోవడంతో లాకప్పు హత్యలకు కొత్త కథలతో నిర్వచనాలు మారుతున్నాయి. బజారుల్లో మానభంగాల సంఖ్య తగ్గుముఖం పడుతుంది.

పై నేపథ్యంలో నేడు దండకారణ్య ఉద్యమంపై జరుగుతున్న దుష్ప్రచారాన్ని ఇక్కడ చూద్దాం. దండకారణ్య ఉద్యమంలోకి మహిళ రావడానికి తాను

ఎంతో సాహసం చేయాల్సివచ్చింది. 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అన్న క్రీ.పూ. 800 నాటి మనువును కాలదన్నడం క్రీ.శ. 20వ శతాబ్దంలో కూడా అంత తేలికైన విషయ మేమీగాదు. అలా వచ్చిన స్త్రీని ఈ ఉద్యమం నుండి బయటకు లాగడానికి మనువు శిష్యులు మనువును మించిన మంత్రాలు నేర్చుకొన్నారు- ఉద్యమాన్ని ప్రజల్లో అభాసుపాలు చేయాలంటే, ముందుగా ఉద్యమంలోని స్త్రీని దెబ్బకొట్టాలనీ, పోలీసులు వలపన్నారు - దీనితో, ఉద్యమంలో స్త్రీకి సముచిత స్థానం లేదనీ విస్తృత విష ప్రచారం మొదలుపెట్టారు. ఇందుకు మహారాష్ట్రలోని గడచిరోలి జిల్లా అరి మహా రాజ విశ్వేశ్వరరావు, బస్తర్ పెత్తందార్లు, ఆదిలాబాద్ గోండు 'పెద్దలు' మన్యంలో కొందరు దుష్ట పెత్తందార్లు తోడయ్యారు. వీరందరు స్త్రీని గూర్చి ఈ క్రింది విధంగా ప్రచారం చేశారు.

1) విప్లవకారుల పేరుతో అడవిలో తిరుగుతున్నవారితో మన ఆడపిల్లలను పంపరాదు.

2) ఊళ్ళల్లో పెళ్ళిళ్ళు కాకుండా సోమరల్లా తిరగుతూ పోలీసు కేసుల్లో హంతకులుగా నమోదు అయినవారు మన ఆడపిల్లల కోసం ఈ అడవికి వచ్చారు.

3) పై నాయకులు తమ భార్యలను ఇళ్ళల్లో అట్టిపెట్టి మన ఆడపిల్లలతో భోగసుఖాలనుభవిస్తున్నారు. విలాస జీవితాన్ని గడుపుతున్నారు.

4) దళంలో ఉండే పురుషులందరూ తమతో ఉండే 2-3 మహిళలను సామూహికంగా అనుభవిస్తారు.

5) దళంలో స్త్రీకి భద్రతలేదు. పురుషాహంకారం పేట్రేగిపోతుంది.

సారాంశంలో పై ఐదు అంశాల చుట్టూతా పోలీసుల, భూస్వామ్య పెత్తం దార్ల దుష్ప్రచారం ముమ్మరమైంది. ఉద్యమంలోని మహిళలను బయటకు లాగ డానికి పోలీసులు మహిళల కుటుంబాలపై ఒత్తిడి తీవ్రతరం చేస్తూ, దళాలపై వేట కొనసాగించి భౌతికంగా నిర్మూలించడం ప్రారంభించారు. లోతా రాజేశ్వరి, వ్వర్ణక్క, సీతక్క, చినబల్లక్క, పద్మెక్ సీతక్క, గంగక్క, సుభిడి, కూర్యం రాజక్క, మరియు చిన్నక్కలు తమ రక్తంతో మహిళా పోరాటానికి వన్నె తెస్తూ

పోలీసుల తూటాలకు బలైనారు. ఈ క్రమంలో శత్రువు తన ఇన్ఫార్మర్ల మెకా నిజాన్ని పటిష్టపరచుకొని దాడులను తీవ్రతరం చేస్తూనే సంస్కరణలను ఇతోధికంగా ప్రవేశపెట్టారు. ఫలితంగా, ఉద్యమంలో నిలబడలేని మహిళలు - పురుషులు కొందరు ఉద్యమం నుంచి వైదొలగారు - వైదొలగి పోలీసులు కోరిన విధంగా పోలీసుల సమక్షంలో ఇంటర్వ్యూలు, ప్రకటనలు పత్రికలకు జారీ చేశారు. సరిగ్గా పోలీసులు కోరిన విధంగానే వారు ప్రవర్తించి తమ ప్రాణాలను వీపులను ఇంకా సరిగ్గా చెప్పాలంటే స్త్రీల విషయంలో స్త్రీ అన్నింటికన్నా మిన్నగా భావించే ‘శీలాన్ని’ కాపాడుకోక తప్పలేదు.

స్త్రీని పోలీసులు పత్రికలకు ఎక్కించారు. స్త్రీ వార్తలలో ‘బాక్స్ ఐటమ్’లు, ప్రత్యేక వార్తలు, ఫోటోలతో సహా ఇంటర్వ్యూలు తామరతంపరగా రాసాగాయి. మహారాష్ట్ర పోలీసు DIG క్రిష్ణన్ ఆంధ్ర ‘దొర’తో పోటీకి దిగారు. దొరగారు ‘భారతి’కి డైరెక్షన్ ఇచ్చి విప్లవోద్యమంపై విషం కక్కడానికి ‘భారతి’ని మన్యంలోకి విడుదల చేయగా, క్రిష్ణన్ స్త్రీని వీడియో టేప్‌లో బంధించి తెరపైకి ఎక్కించాడు. మనువును మించిన కొత్త మనువుల్లా రంగంమీదకు వచ్చి స్త్రీని అవమానించడానికి సిద్ధమయ్యారు. అసత్యాలతో, ఆరోపణలతో విప్లవకారులపై బురద చల్లడానికి, మహిళా ఉద్యమాన్ని ప్రజల్లో అప్రతిష్టపాలు చేయడానికి (వీరు) ఉద్యమంలో నుండి దిగజారిన మహిళలతో కొత్త ప్రయోగాలతో ముందుకు వచ్చారు. మహారాష్ట్రలో చిచ్‌ఘర్ పోలీసులు (దేవురి తా॥ బండారా జిల్లా) సామూహికంగా 4 గురు స్త్రీలను వారాల తరబడి చెరచి జైలుకు పంపినారు. అందులో ఒక యువతికి గర్భం వచ్చిందనీ, అదీ విప్లవకారుల పాప ఫలితమనీ నాటకఫక్కీలో ఫోటోలు తీసి వాల్‌పోస్టర్లు అంటించారు- ఆ నలుగురి సంభాషణలను పోలీసు స్టేషన్‌లో వీడియో టేప్‌పైకి ఎక్కించారు. అదే జిల్లా పోలీసులు మే 92లో అరెస్టయిన పార్వతిని తన భర్త ఎదుట వరుసగా వారంరోజులు సామూహికంగా చెరుస్తూ పార్టీ రహస్యాలు రాబట్టాలని ప్రయత్నం చేసి వారు మాట్లాడిన అంశాలు టేప్‌లోకి ఎక్కించి విప్లవకారుల నిజాయితీకి గీటురాయిగా ప్రజల్లోకి ఆ కేసెట్లు తెచ్చారు- ఇలా ఎక్కడికక్కడే విప్లవకారుల నిజాయితీని శంకిస్తూ పోలీసులు దిగజారిన మహిళలను వాడుకోసాగారు. ప్రజల్లో గందరగోళం విప్లవకారులపై అవిశ్వాసం ఏర్పడాలనీ చేసిన ఇలాంటి అవాస్తవాలు అవగింజంత కూడా ప్రజలను తమవైపు

మలచలేకపోయాయని పరిణామాలు సుస్పష్టం చేశాయి. రోజూ తమ మధ్య, తాము పెట్టింది తింటూ, తమకు బుద్ధులు చెపుతూ, తమకోసం సర్వం త్యజించి ప్రాణాలను గడ్డిపోచలా త్యాగం చేస్తున్న 'ముద్దుబిడ్డల'పై పోలీసులు చేస్తున్న దుష్ప్రచారం ప్రజల్లో నీరుగారిపోయింది. అయినా, పోలీసులు చాలా ఓపిగ్గా ఈ ప్రచారాన్ని పట్టు వదలని విక్రమార్కుల్లా కొనసాగిస్తూనే ఉన్నారు. దేశంలో యేటా వేలాదిమంది స్త్రీలను మానభంగాలు చేస్తూ, స్త్రీలను అవమానిస్తూ, స్త్రీని కించపరుస్తూ ప్రజల్లో వీసమెత్తు విలువ కూడా లేని ఈ పోలీసులు విప్లవకారులపై చేస్తున్న ప్రచారం సూర్యుడిపై ఉమ్మివేయడం లాంటిదేనని 'తార' గారికి తెల్వనిదేంగాదు. అయినా కొత్తకొత్త కథలతో పత్రికలకు స్త్రీలను పరిచయం చేస్తున్నారు- దిగజారిన స్త్రీలచేత విప్లవకారులపైకి సవాళ్ళు విసిరిస్తున్నారు. పౌరహక్కుల సంఘాల నిజాయితీని నిగ్గు దీస్తామంటున్నారు. 1000కి 21 మంది కూడా లేని పత్రికా పాఠకులను ఈ భారతావనిలో తమ వైపుకు తిప్పుకోవడానికి పోలీసులు చేస్తున్న 'భగీరథ ప్రయత్నం' చూస్తున్న పాఠకలోకం 'హతోస్మి' అంటుంది. పోలీసులు ఈస్ట్ డివిజన్ (తూర్పు గోదావరి-విశాఖ) లో ఈ ఉద్యమకాలంలో 50 మంది స్త్రీలను సామూహికంగా చెరచిన విషయం పత్రికాపాఠకులకు తెలుసు. ఈస్ట్ ఉద్యమం నుండి 30 మంది స్త్రీలు తమ బలహీనతలతో దిగజారిపోయి శత్రువుకు 'లొంగి' పోయారు- వీరందరిలో నుండి కొందరిచే శత్రువు పత్రికా ప్రకటనలతో విస్తృత ప్రచారానికి పూనుకున్నాడు. వీరందరి శక్తిసామర్థ్యాలు 'విప్లవ' దీక్ష ఈస్ట్ ప్రజలకు సుపరిచితమే.

ఇందులో కొలికల అప్పాయమ్మ, సంజీవ్‌కుమారి, పాగి రమణమ్మ, కాంతమ్మ, గైరమ్మ, గంగమ్మ, లింగమ్మ లక్ష్మి, కొక్కుల శోభ, చిన్నక్క, పాపక్క, మంగక్క మరియు గంగక్కలు ముఖ్యులు. వీరందరిచేత దళ జీవితంలో తమకు అన్యాయం జరిగిందని పత్రికల్లో పోలీసులు మాట్లాడించారు. సంజీవ్‌కుమారి 10 వ తరగతి చదువుతూ ఉద్యమంలోకి వచ్చింది. ఉద్యమంలో నిలబడలేక, బయట బతకడానికి 'లైసెన్స్' గావాలనే పోలీసులకు లొంగిపోతే, పోలీసులు ఈమెపై ప్రయోగించిన థర్డ్‌డిగ్రీ పద్ధతులతో మనస్థిమితం కోల్పోయి చివరకు వారు చెప్పిన విధంగా పత్రికల ముందు తలవంచింది- కాంతమ్మ, రమణమ్మలు "పోలీసుల భయం, ఒత్తిడితో దళ జీవితంలో అన్యాయం జరిగిందని పత్రికల వారితో చెప్పామనీ, మా తప్పును ప్రజలు, విప్లవకారులు గుర్తించాలనీ, క్షమించాలనీ కూడా వారు

తర్వాత బహిరంగంగా ప్రజల ముందుకు వచ్చారు- ఇలాపత్రికలతో మాట్లాడినవారిలో చాలామంది నేడు మన్యం పోరాటాల్లో తమ స్థానం ఏమిటో తేల్చుకోవలసిన పరిస్థితికి తిరిగి నెట్టబడుతున్నారు- తమ గిరిజన బతుకుల్లోని అశాంతిని, దోపిడిని దూరం చేసుకోవాలనీ, స్త్రీకి సమాజంలో సముచిత స్థానం దొరకాలనీ పోరాటానికి నడుం బిగిస్తే, తాత్కాలిక కష్టాలను భరించలేక గుండెజారి యుద్ధరంగంలో వెనుకబడిపోతే ఈ పోలీసుల వేధింపులతో రోజొక గండంతో బతుకు చేదుగా వుందనీ ఈ మహిళల్లో మెజార్టీ మహిళలు పశ్చాత్తాపంతో ఆత్మ పరిశీలన చేసుకుంటుంటే, చిక్కాలగడ్డ లింగమ్మ (తూర్పుగోదావరి) మాత్రం అర్థశీగల పోలీసు అధికారులకు లొంగిపోయి, వారికి తన 'సర్వస్వాన్ని' సమర్పించుకొని, చివరకు వారిచే వంచితురాలై నేడు రాజమండ్రి జైలులో కుమిలి కుమిలి ఏడుస్తోంది. చిక్కాలగడ్డ లింగమ్మ రాజమండ్రి జైలులో రోదిస్తుంటే, H.J. దొర రూపకల్పన చేసిన 'భారతి' ఈ లోకాన్నే వదలి వెళ్ళిపోయింది. నక్సలైటు ఉద్యమాన్ని ప్రజల్లో అభాసుపాలు చేయడానికి, మధ్యతరగతి ప్రజల్లో భయాలను రెచ్చగొట్టడానికి పోలీసు డైరెక్టర్లు 'భారతి'లో ఎంత విషం నింపారో, చివరకు ఆ భారతే మింగలేకపోయి, ఆ పోలీసుల అత్యాచారాల మధ్య నిలబడలేక ఒత్తిళ్ళకు చాలక ఒకలాడ్జిలో దురదృష్టవశాత్తు ఆత్మహత్య చేసుకొని దొరగారి భారతి చావు కొనితెచ్చుకొంది. భారతులను సృష్టిస్తున్న ఈ వ్యవస్థలో నిజంగా భారతితో మహిళలకు విముక్తిలేదనీ, ఈ వ్యవస్థ నిర్మూలనలోనే స్త్రీ విముక్తి గ్యారంటి అని చావుతోనైనా అర్థం చేసుకొంటారని ప్రజలకు భారతి తన చావు ద్వార సందేశమిచ్చింది- ఒక భారతిపోతే మరో భారతి దొరకడం ఈ దౌర్భాగ్యపు దేశంలో పోలీసులకు ఏమంత కష్టమైన పని కాకపోయినా స్త్రీలోకం క్రమంగా కళ్లు విప్పాలి.

నిర్దాక్షిణ్యమైన వర్గపోరాటంలో తమ తమ వర్గప్రయోజనాలకు భిన్నంగా కొందరు మహిళలు తాత్కాలికంగా తప్పటడుగులు వేసినా, తదనంతరం గుర్తించి, వాస్తవాన్ని తెలుసుకోవడం ముదావహం కాగా, మరికొందరు మహిళలు తమ గతాన్ని విస్మరిస్తూ ఆశలకు అమ్ముడుపోతున్నారు. ఇందుర్తి (కరీంనగర్ జిల్లా) నుండి 7సం॥ క్రితం మన్యం గిరిజనుల గూడాల్లోకి అడుగు పెట్టిన కొక్కుల శోభ (పద్మ) నేడు పోలీసుల గొంతుకు తలూపుతూ, వారి ఆశలకు బలి అవుతూ, మరీ దురుసుగా ఉద్యమంపై బురద చల్లుతుంది. ఆకాశవాణిలో కూడా 'తన అభిప్రా

త్యంగా' పరిచయాలు చేస్తుంది. విప్లవ జీవితంలో స్త్రీలు మోసపోతున్నారనీ, విప్లవం బూటకమనీ, మహిళలు ఐక్యంగా విప్లవకారులను తిప్పికొట్టాలనీ పిలుపులు ఇస్తుంది- మంగక్క అనే మహిళ కూడా ఈ బాట అనుసరిస్తుంది. ఇదే వరుసలో ఇంకా ఒకరు, ఇద్దరు దాడి చేశారు. చేస్తున్నారు- అయితే, వీరందరూ రెండు సంవత్సరాలు ఆపైన్నే విప్లవజీవితాలను అనుభవించారు- ఇందులో కొందరు పెళ్ళిళ్ళు చేసుకొని సూత్ర బద్ధంగా విప్లవ జీవితంలో వైవాహిక జీవితాన్ని గడిపారు. భర్తలతో పాటుగా చివరకు సరెండర్ల తంతులో భాగస్వాములయ్యారు- చిత్రవిచిత్రంగా ప్రకటనలను గుమ్మరిస్తున్నారు- దళ జీవితాల్లో పలకా బలపం పట్టుకొని విద్యాబుద్ధులు నేర్చి మహిళా లోకానికి బతుకు పాటలు, మాటలు చెప్పినారు. చివరకు దురదృష్టవశాత్తు 'విధి' వీరు జీవితాల్తో ఆడుకొంటుంది.

ఏమైనా, వాస్తవాలు ఓపికగానే, అయినప్పటికీ తేలికగానే వెలుగు చూస్తాయి. స్త్రీ సమస్యను పోలీసులు జటిలంచేసి సమాజంలో స్త్రీలకుజరుగుతున్న అన్యాయాల్ని తాము ఉద్ధరించే కర్తవ్య పారాయణులుగా ఫోజు పెడుతూ తెరమీదకు వస్తున్నారు. కానీ నిజానికి నేడు దేశవ్యాప్తంగా ఎక్కడికక్కడే పోలీసుల హింసా, అత్యాచారాలను ఖండిస్తూ మహిళలు అనేక సభలు, సమావేశాలు చేస్తున్నారు. రంగనాథమిశ్రా లాంటి న్యాయపీఠాధిపతులను కూడా మహిళలు ఖండిస్తూ ఉద్యమిస్తున్నారు- సినిమా ఫక్కీలో డైలాగులు వదలుతూ స్త్రీలపై అనేక ఉపన్యాసాలు దంచే మిస్టర్ వందమూరిగారు సిగ్గులేకుండా వృద్ధాప్యంలో జంట కుదిరి పెళ్ళికి కొత్త నిర్వచనాలు ఇస్తున్నారు- సారా ఉద్యమంలో పోరాడిన లక్షలాది మంది మహిళలను అనేక విధాల వేధిస్తూ లెక్కకు మించిన కేసులతో అవమానపాలు చేస్తున్న ఈ పోలీసులకు, అనేక సామాజిక రుగ్మతలలో ముఖ్యసూత్రధారులైన ఈ వ్యవస్థ రక్షక భటులకు విప్లవ కార్యకర్తల నైతిక విలువలను ప్రశ్నించే కనీస హక్కు గూడా లేదు- విప్లవకారుల చిత్తశుద్ధిని, నిజాయితీని ప్రజలు శంకిస్తే ఈ దేశంలో పోలీసురాజ్యం మరీ పెచ్చరిల్లేది.

సమాజంలో స్త్రీ - పురుషుల మధ్య అనేక సమస్యలు తలెత్తడాన్ని ఎవరూ కాదనలేరు. అదే రీతిలో యువతీ యువకులతో నిండి ఉన్న ఏ సంస్థలోనైనా కొన్ని సమస్యలు తలెత్తడంలో ఆశ్చర్యమూ-వింత ఏమి లేదు- అయితే వాటిని ఎలా పరిష్కరిస్తున్నారనేది కీలకమైన ప్రశ్న. విప్లవ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని సమస్యను పరిష్కరించడమే ఆ విప్లవ సంస్థ ఉనికికి, ఎదుగుదలకు గీటురాయిగా ఉంటుంది- పోలీసులు గోరంతలను కొండంతలు చేస్తూ అభూతకల్పన

లతో ప్రజల్లో గల విశ్వాసాలను సొమ్ము చేసుకోవడానికి ఎంతటి ప్రయత్నం చేసినా, వీరికి ఉద్యమం నుండి దిగజారిపోయిన మహిళలు కొందరు తోడైనా, విప్లవ ప్రజలు వీరిని ఏనాటికి విశ్వసించరు- 15 ఏళ్ళుగా తమతో సహచర్యం చేస్తున్న విప్లవకారుల స్వభావం, తప్పు జరిగిన యెడల ప్రజల్లో వారు నిర్ద్వంద్వంగా ఆత్మ పరిశీలనతో తప్పు అంగీకరించడం వారి విప్లవ తత్వానికి, నిజాయితీకి, విప్లవ నిబద్ధతకు గీటురాయిలా పని చేస్తుందనీ ప్రజలు తీర్పు ఇస్తున్నారు. సమస్యలు ఎదుర్కొన్న మహిళలు అర్థం చేసుకోని ఆ సంస్థలు రూపొందిస్తున్న పాలసీలతో, క్రమశిక్షణా సూత్రాలతో స్పందిస్తూ కొత్త ఉపిర్లతో ముందడుగు వేస్తున్నారు. పోలీసు లంచేనే ప్రజల్లో ఎలాంటి వాతావరణం ఏర్పడి ఉందో వారి నాయకులు-అధికారులు ప్రతి సందర్భంలో వారిని "బుద్ధిగా మెదలాలని" హెచ్చరించడం చూస్తేనే అర్థమవుతుంది. ఈ మధ్య తూర్పుగోదావరి జిల్లాలో ఒక మహిళను రాత్రి పోలీసు లాకప్‌లో ఉండాలనీ పోలీసులు ఎంత వేధించినా, ఆ మహిళ సపేమిరా అంగీకరించకుండా, "స్త్రీలకు పోలీసుస్టేషన్‌లలో ఎలాంటి రక్షణ లేదనీ, పోలీసులు ఏ క్షణాన మీదపడి అఘాయిత్యం చేస్తారోనని" కుండ బద్దలు గొట్టినట్టు చెప్పి ధైర్యంతో అక్కడి నుండి బయట పడింది. ఈ ఒక్క ఘటనే ప్రజల నాడి తెలిసినవారికి గొప్ప హెచ్చరిక అవుతుంది.

యేటేటా మహిళా ఉద్యమాలు మరింత తీవ్రరూపం ధరిస్తున్నాయి- దండకారణ్యంలోని విప్లవోద్యమంలో ఉన్న దఖనులకొద్ది మహిళలు నేడు తెగింపుతో తమ శక్తులను మరింత కూడదీసుకుంటున్నారు- పోలీసుల అత్యాచారాలను, బూటకపు ఎన్‌కౌంటర్లను విప్లవ వనితలు, దండకారణ్య ఆదివాసీ మహిళలు ప్రతిఘటిస్తూ పోరుమార్గం తమదంటున్నారు. ప్రతి మహిళతో తాము పెనవేసుకపోవడానికి కృతనిశ్చయంతో నడుం బిగించి పోరాడుతున్నారు. నిందారోపణలతో మహిళలను తప్పు పట్టడం, విప్లవకారులను శంకించడం పోలీసుల దుష్ప్రచారంలో ఒక భాగం తప్ప మరేంకాదనీ ప్రజలు గుర్తించిన చందంగానే దిగజారిపోయి నిత్యం పోలీసుల వేధింపులతో సతమతమవుతున్న మహిళకూడా గుర్తించి విప్లవ మహిళతో నడుంబిగించి కదంకలిపి తన భవిష్యత్ జీవితాన్ని సరిదిద్దుకోవాలనీ అంతర్జాతీయ మహిళాదినం సందర్భంగా కోరుతున్నాను-

—'శ్వేత'

'దండకారణ్యం'.

# లడాయే మా జీవితం !

నేను ఒక ఆదివాసి మహిళను. నాకు లోకజ్ఞానం తెలిసినప్పటినుండి ఆదివాసి స్త్రీగా మాడియా కట్టుబాట్లతో అణచబడ్డ స్త్రీని. మా మాడియా స్త్రీలపై అణిచివేత కొనసాగుతున్నదని అడివన్నలు వివరించే వరకు అర్థంకాలేదు. మా ఆచారంలో చాలా కర్కశమైన అణిచివేత కట్టుబాట్లు వున్నవి. ఆడపిల్లగా పుట్టినందుకు మా తల్లితండ్రులు సంతోషించేది ఒకే ఒక్కసైమ్- అది మా పెళ్ళికి పిల్లవాని తర్ఫునా మా వాళ్ళకు దొరికే కన్యాశుల్కం క్రింద మమ్మల్ని పశువులలాగా ఇష్టమున్నా లేకున్నా బలవంతంగా మేనరికం వాళ్ళకు కల్లుతాగి మమ్మల్ని కట్టబెట్టినరోజు.

పెళ్ళి అయిన తరువాత మా జాకెట్లను తీసివేసి, తెల్లని ఒక ధోవతి ఇస్తారు. ఇదే మా శరీరాన్కి రక్షణ. వాన, చలి, ఎండ ఏ కాలంలో ఐనా మాకు ఇదే చీర, జాకెట్టు. ఈ ఆచారాలు, కట్టుబాట్లు ఎందుకు వచ్చినవి ? వాటి నుంచి ఫలితం ఏమిటి ? అంటే సమాధానం వుండదు. తరతరాల సాంప్రదాయం అంటారు పెద్దలు ....వారి ఇష్టం లేకుండా జాకెట్ తొడిగితే ఇంట్లో మనుషులుకాని, పశువులుకాని అనారోగ్యమైనా, చనిపోయినా జాకెట్ తొడిగినందుకు దేవుడు కోపగించుకున్నాడు అని బలవంతపెట్టి జాకెట్ కాలబెట్టుతారు. ఇక, తిండి విషయంలో కూడా మాకు కట్టుబాట్లు వున్నవి. స్త్రీలు సంతానోత్పత్తిదారులు కాబట్టి కోడిగ్రుడ్లు తినకూడదు అట్లా అంటే "పాపం". కొన్ని పండుగలు పురుషులు వేరుగా చేసుకొని కోళ్ళు మేకలను కోసుకొని తింటారు. ఆ పండుగలకు స్త్రీలు పోరాదు. అక్కడ వండే పదార్థాలు తినడం పోలదు. మూదోవంతుకంటే ఎక్కువ ఇళ్ళల్లో స్త్రీలకు చాయ్ (డికాషన్) నీళ్ళు కూడా కరువే. అంతెందుకు స్త్రీలను వస్తువుల క్రిందనే జమకట్టి మాట్లాడటం ఇక్కడా ఆచారంగా మార్చారు.

## అన్నలు వచ్చిన తరువాత మార్పు ఎలా వుంది ?

- మా ఊర్లకు అన్నలు రావడం పెరిగి మా రేంజి జిల్లా అంతా మహిళల ఆలోచనల్లో చాలా మార్పులు వచ్చినవి. మేము దళాల్లోని అన్నల - అక్కల ఆలోచనలలో పాలు పంచుకోవడం అవసరం అని గుర్తించాము. మాపూళ్లో అన్నల "సంఘం" బలపడగానే మా అక్కల సంఘం నిలబడి పాత భావాలపై, తప్పుడు

ఆలోచనలపై, బూజుపట్టిన రివాజులపై పోరాటం మొదలు పెట్టినం మా పెద్దల పెద్దరికం మా పై వుండకూడదని మేము - మాతోపాటు DAKMS నిలబడింది. మేమంత ఒకటి కావడంతో మా పోరాటంలో వాస్తవం కూడా వుండటంతో పెద్దలు ఏమి చేయలేక మేము చెప్పిన మాటలు వింటు మా వెంటా రాసాగారు. దాంతో మీటింగులల్ల యింక యే పోరాటం చేసి మార్పులు తేవాలనే అక్కలమంతా వివారం చేసినం. కొన్ని పోరాట పాటలను కూడా మా సొంతంగా - జంపర్ పాట, కమ లక్క పాట, చలోరే, చలోరీ మొదలైనవి రాసుకున్నాం.

ఫారెస్టు ఆఫీసర్లు, పేపర్ మిల్లు వాలలంతా రోజుకూలీ ఇచ్చేటప్పుడు మాకు మొగవాళ్ళకన్న తక్కువ ఇచ్చేవాళ్ళు, మొగోళ్ళకు, ఆడోళ్ళకు తేడా బంద్ - "ఒకటే పని - ఒకటే కూలీ" అనే నినాదం అమలు అయింది. స్త్రీలు తక్కువ కాదని లోకులకు చెప్పినది. అప్పటిదాక మమ్మల్ని దోచుకున్న తెల్లబట్టలవాళ్ళు మా సంఘబలం చూసి షావుకార్లు, టేకేదార్లు, బెంగాళీలు అందరు నోరు మూసుకున్నారు. తలఎత్తి మమ్మల్ని చూసే ధైర్యం చేయలేదు. మేము సంఘంలో ముందుండి పనులు చేస్తుంటే మాకు ఎవ్వరు ఎదురు చెప్పలేదు. మేమందరం కలిసి"చీకటన్నలు" చెప్పిన వెలుగుదారిలో నడిచినం. మా చిన్న చిన్న తమ్ముండ్లు, చెల్లెలైతే దళం వచ్చిందంటే ఇంటికి రావడం బంద్. అడవిలో దళం దగ్గరేవుండి బాల సంఘం పెట్టింర్రు. మేం పార్టీకి ప్రేమ యిచ్చినం, దళాలు మాకు ప్రేమనిచ్చినయ్. కష్టాల్లో, సుఖాల్లో మాతోటే వాళ్ళు. పండుగ, పబ్బం వచ్చినా మనోళ్ళు రాలేదని ఎదురు చూస్తుంటాం. పల్లెలల్లో పంచాయితీలు చెప్పలన్నా, భూమి కావాలన్నా సంఘం. సంఘం తీర్చలేని పంచాయితీలు దళం తీర్పు చెప్పేది.

-జూలై 28 న ప్రజలకోసం ప్రాణాలర్పించిన వీరుల స్మారక స్థూపం కట్టి ఎర్రజెండా ఎగురవేసినాం. అందరం ఒకరికి ఒకరకంగా పనులు చేసుకుంటూ పోలీసోడు ఊర్లో క్యాంపు పెట్టినవాళ్ళ కండ్లు కప్పడం నేర్చినం. మాపైబూటకపు ఎన్‌కౌంటర్‌లు జరిగినా, అన్నల పిలుపుమేరకు బంద్ ప్రోగ్రాముల్లో పాల్గోనడం మొదలు, ఫైర్ చేయడం వరకు నేర్చినం. మా లోకమే మారింది. 2, 3 సంవత్స రముల క్రింద - పొలం, ఇల్లు ,మొగుడు - పిల్లలు తప్ప మరో ధ్యాస లేదంటే నమ్మరు. ఇప్పుడు అట్లా కాదు - ఇరాక్ సద్దాం సంగతి నుండి ఐ.ఎం.ఎఫ్ అప్పు లిచ్చేటోని దోపిడి మొదలుపెడితే సారా పోరాటం వరకు ఊరూరా తిరిగి సభలు-

సమావేశాలు చేయడం వరకు మాకు నేడు కావాలి. ఇట్ల చెప్పితే చాలానే వుంది. ఏం చెప్పిన పాత ఊరు కాదు. పాతమందిమి కాదు. కొత్త ఆలోచనలు - పోరు మాట - పోరుపాట మా బాటగా మెదడులో మసులుతుంటాయి.

## సంఘంలో స్త్రీల పాత్ర - అనుభవాలు

మా వూర్లోకి దాదాలు (అన్నలు) వచ్చి సంఘం పెట్టుకోవాలి అన్నారు. కాని అప్పుడప్పుడే వూర్లో మొగవాళ్ళు మాత్రమే సంఘంలో వుండేవారు. అంతవరకు బాగానే వుంది. మరి ఇప్పుడు అక్కలు కూడా సంఘంలో వుండాలి అని చర్చ ఒక దిక్కు, మా అవసరాలు మరో దిక్కు ముందుకు వచ్చినవ్. దళం అక్కలు మమ్మల్ని విడిగా తీసుకపోయి క్రాంతికారి ఆదివాసి మహిళాసంఘం పెట్టింద్రు. అప్పుడప్పుడు కమాండర్ కూడా మాకూ మీటింగ్ పెట్టి "అక్కలు మీరే ప్రపంచంలో ఎక్కువ దోపిడికి గురి అవుతున్నారు. పేద ప్రజలను పీడించేది మూడు రకాల దోపిడిదార్లు ఐతే మీకూ మొగపెత్తనం అదనంగా నాల్గో దోపిడి పీడనకి గురవుతున్నారు. ప్రజాయుద్ధ పోరులో మీ వంతు కర్తవ్యం సగానికి పైగానే వుంది." అని మాకు తెలియని విషయాలు ఎన్నో చెప్పిండు. అలాగే దళం అక్కలు అంకమ్మ, నిర్మల, స్నేహలత, జ్యోతి, కుసుం రాజక్క, స్వర్ణలత, స్వరూపల సాహసాలు, పోరాటంలో వాళ్ళ పాత్ర ప్రజల పక్షం వహించి పోరాడిన తీరు పేదవాళ్ళ బిడ్డలుగా వారు చేసిన కార్యాలు కథలు వీరవనితల చరిత్రను చెప్పి మా కర్తవ్యం ఏమిటో వివరించడం జరిగేది. ఇవన్నీ కూడా మాకు ఊపును ఉత్సాహాన్ని మాలో పోరాట పటిమను పెంచి సంఘంలో నిలబెట్టి పోరులో మా వంతు కర్తవ్యాన్ని మార్గాన్ని చూయించాయి.

అప్పుడే మా జిల్లా DAKMS సభ్యున్ని పోలీసులు అరెస్టు చేస్తే విడిపించుకున్నాం. అల్లపల్లి అకులమోర్య, ఎమిలికస్స, గురిజకోద్ర మెండలలో పోలీసులకు వ్యతిరేకంగా పోరాటాలు జరిపాం. అలాగే నందునొండిలో తుపాకులు గుంజుకోవడం మొదలు, అక్కలు జాకెట్లు వేసుకోవడం వరకు అన్నిట్లో ముందుండి వూరూ వూరూ తిరిగి KAMS లను పెట్టుకున్నాము. KAMS నాయకత్వం క్రిందనే అనేక పోరాటాలు నిర్వహించాము. గుండెరలో ఒక పిల్లవానిమీద నుంచి కల్లు తాగిన నిషాలో పోలీసు జీపు తీసుకెళ్ళినప్పుడు అక్కలంత సంఘ నాయకత్వంలో కదిలి

పోలీసు క్యాంపు చట్టుముట్టి పోలీసులను కొట్టి, తుపాకులు కూడా గుంజుకునే ప్రయత్నం చేయగా క్యాంపు ఇన్‌చార్జి తప్పయింది అని ఒప్పుకొని చేతులు ఎత్తి క్షమించమని కోరిన తరువాతే విడిచిపెట్టడం జరిగింది. ఇలాగే సంఘంలో మహిళలు సంఘటితం కావడం, ఆకులు, వెదురు, ప్లాన్‌టేషన్, రోజుకూలీ, కరువు పోరాటంతో పాటుగా ప్రతి పోరాటంలో పార్టీ నాయకత్వంలో మేం పాల్గొనగా, మా ఇండ్లలోని అన్నలు, తండ్రులు, భర్తలు వీరందరి సహకారం కూడా దొరికింది. ఎందుకంటే- ఇది పేద ప్రజల పోరాటం. పేదోల్లం అంతా ఒకటై లేనొల్లం - ఉన్నోళ్లకు వ్యతిరేకంగా పోరాడే పోరాటం మాది, మావో మహాశయుడు చెప్పినట్లు...."ఆకాశంలో సగం మీరు, సగం మేము", పోరాటంలో సగం మీరు సగం మేము". అది నిజం చేయడం ఎంతైనా మా కర్తవ్యంగా భావిస్తున్నాం.

ఇలాగే కొన్ని సందర్భాలలో అక్కలు ముందుండి సంఘనాయకుల్ని విడిపించుకోవడంకాని, మోర్చల సందర్భంలో అక్కలు ముందుండి మాట్లాడడం, మొదలు ప్రతి పంచాయితీలో కూడా మహిళాసంఘం అక్కలు లేకుండా పనులు జరగని పరిస్థితి వచ్చింది. కొన్ని వూర్లల్లో మహిళాసంఘమ్ ప్రజావ్యతిరేకులను శిక్షించడం, తప్పు చేసినవారిని ముక్కు నేలకు రాయించడం జరిగింది. ప్రతి పోరాటంలో మా KAMS కర్తవ్యం నెరవేర్చుకుంటూ, రాజకీయంగా అభివృద్ధి అవుతూ కొంతమంది మహిళలు రైతాంగ గెరిల్లా దళంలో కూడా చేరారు. ఈ క్రమంలోనే మా పై నిర్బంధం కూడా మొదలై గడదపల్లిలో నలుగురు అక్కలను, దేవునిలో రామోతితోపాటు ఇంకా ముగ్గురిని పోలీసులు రేప్ చేయడం, అరెస్టు చేయడం జరిగింది. అలాగే మా భర్తలు పార్టీలో చేరినందుకు వారి భార్యలైనందుకు అరెస్టు చేసి కొట్టడం, భర్తలను సరెండర్ చేయించమని అనారోగ్యంతో వున్నా వదలక అరెస్టు చేయడంతో ఈ మధ్య ఒక అన్న భార్యను పోలీసులు కొట్టినందున సీతక్క మరణించింది. మా బిడ్డలు పార్టీలోకి వెళ్ళితే ఇంట్లో వున్న తల్లితండ్రులను చిత్రహింసల పాలు చేస్తున్నారు. మా పై ప్రభుత్వం, పోలీసులు పాశవికంగా ప్రవర్తిస్తున్నారు. ఐనా భూమి భుక్తి విముక్తి కోసం పోరాటం విడువకుండా ముందుకు పోవాలనే తయారు అవుతున్నాం. స్త్రీ కూడా ఒక మనిషే - దోపిడి రాజ్యాన్ని కూల్చడంకోసం ఒక్కొక్క మహిళ ఒక మందు పాతరగా ప్రేలుతుంది.

## భర్తలు పోరులోకి వెళ్ళిన తరువాత మా పరిస్థితి

అవసర రీత్యా ఐనా, లేక నిర్బంధంవల్ల అయినా ఉద్యమంలోకి వెళ్ళిన ఇంట్లో పిల్లలతో, ఇరుగుపొరుగుతో, బంధువులతో మాకు ఎదురైన సమస్యలూ ఉన్నాయి. ఇంట్లో పిల్లలు సహజంగానే అందరికి దగ్గరగానే వుంటారు. తండ్రి లేడని బెంగ ఒక దిక్కు పిల్లలకి తిండి లేదనే బెంగ మా స్త్రీలదిగా పరిస్థితి మారింది. రోజు యింటిల్లిపాదిమి అందరం కలసి అడవితల్లి ఒడిలోని కూకు (పుట్టగొడు గులు), కక్కు (వెదురు) ఆకూ అలం-యిలా ఏదో ఒకటి తెస్తే పొట్ట నిండుతుంది. చినుకు పడితే దుక్కులు దున్ని, విత్తనాలు చల్లాలి. పంట వచ్చగా కాగానే పందులు, పశువులు అడవిజంతువుల నుండి కాపాడుకోవాలి. సంఘంలో తిరగడం మొదలు కాగానే మా భర్తలు వ్యవసాయం చేయడం తక్కువయింది. ఉమ్మడి కుటుంబాలైతే యింటిల్లిపాది కలసే చేస్తారు. ఒంటరి స్త్రీగా కష్టం ఎదుర్కొనలేదు. కాని వేరుపడ్డ కుటుంబం అయితే యిక మా తిప్పలు చెప్పుకోలేము. అయినా సిద్ధపడ్డాం. విప్లవం రావాలని కొట్లాడాలనే అనుకున్నాం.

పోలీసుల నిర్బంధం పెరిగితే ఊర్లో, రేంజిలో తిరిగే మా పురుషులంతా అడవన్నలతోనూ వెళ్ళడంతో మా తిప్పలు యింకా పెరిగినయి. పోరనికి అంగి లేదు-పోరికి మందులేదు రోగంవస్తే. వానవస్తే గుడిసెకు కప్పులేదు. వ్యవసాయం చేద్దాం అంటే గింజె విత్తనం లేదు. ఐతేనేం-కూలిజేసి పిల్లల సాకి, ఊర్లో సంగం అండతో యిల్లు గడిపేస్తున్నాం. మాలో కొందరు, అడవికి వెళ్ళిపోయింద్రు. పోలీసు బాధలు ఒకదిక్కు - సంగం పని చేయాలనే ఆరాటం పిల్లలనకూడా విడచి వుండేలా శక్తి నిచ్చింది. శక్తి గల మాతోటి అక్కలు-చెల్లెండ్లు పోరాడుతుంద్రు భర్త-భార్య జంటగా సర్కార్‌తో సవాల్‌చేసి హక్కులు కావాలని కొట్లాడి చావుకు సిద్ధపడి పోయింద్రు.

శక్తి లేనివాళ్ళం ఊర్లో మిగిలినం. శక్తి వున్నా ఊరు పని కోసం యింటి కోసం వుండాల్సిందిగా చెప్పితే వున్నాం. మా భర్తలు అడవిలోనే వున్నారు. కానీ యిండి మేం ఎట్లో అట్లా లడాయి చేయడం విడువకుండా నిలబడతాం. దుక్కి దున్నుతాం, పంట తీస్తాం, యిల్లు కడ్తాం, యింట్లో ముసలివాళ్ళకు తిండి పెడ్తాం, పిల్లలను చూస్తాం - యివ్వేకాదు మా సంఘం పని రాత్రి-పగలు ఎప్పుడైనా చేస్తూనే

వుంటాం. మా భర్తలతో చీకటి మాటున వెన్నెల వెలుగులోనే మనసునిండా వలకరించి చేరదీసి పంపుతునే వుంటాం.

— పిల్లలను పెంచడం ఎలా ?

తండ్రి కోసం పిల్లలు బెంగపడ్తున్నారని చెప్తి గదా వాళ్ళ పెంపకం తల్లి-తండ్రి లేని స్థితి ఎదురై ఊరువారే తల్లి తండ్రి అయి సాకే స్థితి చాలామందికి ఎదురైంది. రాజక్క సంగతి విన్నారుకదా! ఆ అక్క ఇద్దరు పిల్లలను వదిలి వచ్చింది. ఆఖరి చూపుకూడా దక్కలేదు పిల్లలకు తల్లి ది-తల్లి కి పిల్లలది. యిక యింట్లో తల్లులం మిగిలితే ఏ రాత్రి పోలీసులు ఎవరిని పట్టుక పోతారోననే బెదురు. యిది మాదేకాదు ఊరి అందరిది. తండ్రికోసం ఎదిగిన కొడుకును పట్టుకపోవడం లేదా కొడుకునే తండ్రి అని చుట్టుముట్టిన రోజులు చూసినం.

సంఘంలో వుండి జాకెట్ తోడిగినం - ఊరి పెద్దలు మా పెనిమిటి లేక పోవడం చూసి గుడ్లెర్ర చేస్తారు. తెల్లధోవతే కట్టినా జాకెట్ తోడిగే వాళ్ళ మాట లకు జవాబు చెప్పినం. ఏదో ఒక హాస్టల్‌ల - ఆశ్రమంల పిల్లలను ఏసినం. సెలవులకో, పండుక్కో పోరడు వచ్చి నాయనేడి అంటే దళంలోకి పోయిందనే చెప్పినం. పోలీసులు ఎందుకొచ్చిండ్రు అంటే రాజ్యం కావాలని లడాయి చేస్తు న్నందుకే అని చెప్పినం. కాని దళంను పిల్లలు చూడనే బట్టిరి. స్కూలిడిసి వచ్చి న్నాడు దళం ఊర్లుంటే పిల్లలు దళం కాడనే వుండుసాయే మేం అబద్ధం ఆడేది ఏముంది మరి ?

పండుగ, పబ్బం వస్తే ఉమ్మడిల్లు అయితే మామో, మరిదో ఊరి పనికి పోయిరి. యిక ఒంటికాపురం అయితేనే చిక్కంతా. ఆడదాన్ని అని రానీయరు. మొగడు లేకపాయే సంఘంకు చెప్పి మా వంతు పనికి ఆడదాన్ని రానిచ్చే వాటికి వస్తనంటె కుదరదని పెద్దలంటే బంద్. సంఘమొల్లె మావంతు పనికి నిలబడిరి నాలుగురోజులు రమ్మని చీటి వస్తే నల్గురు పిల్లల తల్లి ఏడికిపోతది. కూరా నార తెచ్చెడు, పరాయి ఊరుపోవడం ఒకటేనా ? అయినా కొత్తసాలు ఏస్తున్నాం. కొత్త ఎవరికైనా కష్టమేకదా మరి !

ఇక చివరిగా పేగు సంబంధం కన్న-వర్గ సంబంధం మిన్న అయిన పోరాట బంధం మాది. పేగు కోసి బొడ్డునుండి బిడ్డను వేరుచేస్తె సోయితప్పిన నెత్తురు మడుగైనా నవ్వినం పక్కనున్న పండును చూసి-రక్తం ప్రేమ అది అని. మరి నా వాళ్ళు నా రక్త సంబంధీకులు నా మొగుడో మాయింట్లో యింకెవరో అడివి పత్తే ఆందోళనలో పాలు పంచుకుంటే దూరం అయిందిలేదు. ఎక్కడో నూటికి సల్గురు తప్ప-కాని పేగు బంధం పెట్టుకున్న పెంచుకున్న మా వాళ్ళు కలువడం అలస్యం అయితే యిక మా బాధ రోజంత పెరుగుతుంది. యిక్కడ కాల్పులు-అక్కడ చావు-మరెక్కడో సరెండర్ వార్త యిలా యీ వార్తలనీ కలవరపెట్టాయి. ఏ తల్లి కన్నపిల్లలో అని వాపోతం-యివి ఒక ఎత్తు యిక మరోటి ఊర్లో ఏం చేసుడు ? వెదురుపని రావట్టే, వక్కడే చేయ్యాల్నాయే. వర్షాకాలం పనులు, పోరాటాలు ఏదో ఒకటి వుండే-మరి ఎప్పటికప్పుడు అందరం జమ-అయి మాట ముచ్చట చేసి పోరు దారి నిర్ణయం చేసుకుంటే అడివి బిడ్డల అండ కావాల్నాయే. యేట ఓసారి అన్న క్లాసుకు, కాన్ఫరెన్స్‌కు ఏదో ఒక పనికి నాలుగు ఊర్లోల్లను కలువుడు కావాలాయే-నలుగురం కలసి మాట ముచ్చట చేయకుంటే చీకట్ల వున్నట్లైనాయే మాకు దేశం దేశం వార్త చెప్తే తప్ప మనసు కెక్కదాయే. చదువురాదాయే-రెడియో లేదాయే! దునియా ముందుకు పోతదనే నమ్మకం-దళం కలిస్తే మంచిమాట, లడాయిమాట, ప్రేమబంధం పేగుబంధం ముడిపడలేదాయే. అందుకే నాల్గురోజులు మావాళ్ళు కలువకుంటే మనసు మనుసులుండదు. రాత్రి పిలుపు వస్తదో-పగలు వస్తదో అని గిలాసదు నూక (బియ్యం) ఎక్కువ వండుతం నమ్ముతారో నమ్మరో మీరు మరి.

ఏమైనా యిప్పుడు లడాయే మా జీవితం-జీవితంలో దారి దొరికింది. అండ దొరికింది. మాకు యింకేమి కావాలి !

— మైనా

# జనపనారలో జనఘోష

అందరం కలిసి చేసిన ఈ
అందమైన వస్తుసముదాయం అంతా
ఎక్కడో ఒక్కడే వచ్చి
ఎత్తుకుపోతూ ఉంటే చూచి
"అన్యాయం, అన్యాయం !" అని మేమంటే —
"అనుభవించాలి మీ కర్మం" అంటాడు.

—శ్రీశ్రీ

## [విరసాన్ని ప్రజల సంస్థగా మరింత ముందుకు తీసుకుపోదాం

విప్లవ రచయితల సంఘాన్ని ప్రజా సంస్థగా మరింత ముందుకు తీసుకపోవాల్సిన అవసరం ఈరోజు విప్లవరచయితలంగా మన ముందు వుంది. రాజ్య హింస, నిర్బంధం వ్యూహ పథక ప్రకారం ప్రజలపైన, ప్రజా పోరాటాలపైన, ప్రజల సంస్కృతిపైన పాశవిక దాడి చేస్తున్న నేపథ్యంలో విరసం గాని మరే యితర విప్లవ సంస్థగాని ప్రజా సమస్యల్ని అధ్యయనం చెయ్యడంలో, వాళ్ళ పోరాటాల్లో భాగం పంచుకోవడంలో, వాళ్ళతో కలిసి జీవితాన్ని పంచుకోవడంలో అలసత్వం చేస్తే వాటి మనుగడకే ప్రమాదం రావచ్చు. ప్రజల్లో కలసిపోవడం ద్వారా, ప్రజలపై ఆధారపడటం ద్వారా మాత్రమే అవి నిర్బంధాన్ని తట్టుకొని నిలవగలుగుతాయనేది చరిత్ర సత్యం.

అంతేకాదు విప్లవ రచయిత రచన, జీవితం ప్రజల సొంతమైనప్పుడు, అతనిపై దాడి జరిగినా, అతన్ని అరెస్టు చేసినా, అతని తరఫున ప్రజలు నిలబడతారు ప్రతిఘటిస్తారు. ఆ స్పందన, ప్రతిఘటన అమూల్యమైంది. నీళ్ళలో చేపలా ప్రజల్లో కలిసిపోవాలనే సూత్రాన్ని విప్లవరచయితలుగా మనం మర్చిపోరాదు.

ఈ సందర్భంగా నెల్లిమర్ల ఘటనపై కా॥ చలసాని, కా॥ క్రిష్ణాభాయిలు పంపిన రిపోర్టు ప్రజా సమస్యల పట్ల విరసం బాధ్యతను గుర్తు చేస్తుంది.

అలాగే అన్ని ప్రాంతాలనుండి ప్రజా సమస్యల పట్ల ఆ యూనిట్ల రిపోర్టులు వచ్చేలా నిరంతరం కృషి చేద్దాం.

—కళ్యాణరావు
కార్యదర్శి
విప్లవ రచయితల సంఘం]

నెల్లిమర్ల — ఆంధ్రదేశంలో ఉత్తరాంధ్రలో ఓ కొసకున్న చిన్న వూరు. సోషల్ స్టడీస్ పాఠాల్లో, జనపనారమిల్లు వున్న వూళ్ళల్లో ఒకటిగా, హైస్కూలు పిల్లలు బట్టీ పట్టే పేరు. ఆ చుట్టుపక్కల కొన్ని వేల మందికి జీవనాధారమైన జూట్ మిల్లు అది. యజమానికి కల్పవృక్షం, కామధేనువూను. నకిలీ రాజకీయ నాయకులకి పట్టుకొమ్మ. ఇవేళ చరిత్రాత్మకమైన కార్మిక శక్తికి సంకేతం.

ఎన్నో లాకౌట్ల చరిత్ర కలిగిన నెల్లిమర్ల జూట్‌మిల్లు యంత్రభూతం. నర నైవేద్యం, రక్తతర్పణతో గాని దాని దాహం తీరదు. అది 1974 అయినా, 1994 అయినా కార్మికుల గుండెల్లోంచీ గుళ్ళు దూసుకుపోనిదే దాని తలుపులు తెరుచు కోవు.

కార్మికులు తమ కోర్కెల సాధన కోసం సమ్మె చేస్తున్నారు. గేటు బయట బైఠాయించి, ప్రశాంతంగా, ఆపేటి జనుంపంట మిల్లుకి తోలడమూ, నార తీయడమూ- అదంతా అయిపోయింది. కార్మికుల రక్తం పీల్చి యజమాని ధనం మూలాలు పోగు చేసుకోవడమూ అయిపోయింది. ఇంక వాళ్ళ సమ్మె తాలూకు తలనొప్పి తాను భరించడమేల ? బైట కార్మికులు బైటే వున్నారు. మిల్లుకి తాళాలు వేసేశారు. 'లాకౌట్' అన్నారు. జనం అలాగే కూలబడిపోయారు. యజమానికి ఇది మామూలే. మళ్ళా సీజన్ దాకా తనకి ఢోకా లేదు. మంత్రులూ తనవాళ్ళే, మిల్లూ తనదే. హాయిగా కలకత్తా వెళ్ళిపోయాడు.

ఈ ఆటలు ఇక చెల్లవన్నారు కార్మికులు. తాడో పేడో తేలాల్సిందే నన్నారు. ఎన్నాళ్ళని యీ నాటకాలూ, దాగుడుమూతలూను ?

వేలాదిమంది ఏ ఆధారమూ లేకుండా నెలల తరబడి అలాగే మిల్లు చుట్టు పక్కల తారట్లాడుతున్నారు. ఉలుకూ పలుకూ లేదు. ఎవరికీ చీమ కుట్టినట్టు లేదు. వాళ్ళ కోర్కెల సాధన గురించి కాదు, వాళ్ళలో ఎలా చీలిక తీసుకురావాలా అని ప్లానులు. కొందరికి అప్పులిప్పించి తమవాళ్ళుగా నమోదు చేసుకుని మిల్లు నడి పించాలని ప్రయత్నాలు. యూనియన్‌ను చీల్చనిదే తమ రాజకీయ పెత్తనం సాగదని మంత్రి సాంబశివ రాజుకీ, తదితరులకీ అర్థమైపోయింది. అందుకనే ప్రలోభాలు ఎరపెట్టి కార్మికులు కొందరిని తమ పక్కకు తిప్పుకోవాలని ఎన్నోరకాలుగా ఎత్తు లేశారు. కాని కార్మికులు ఏకంగా నిలబడ్డారు.

"మనం పడే పాటుకి నేయమో అన్నేయమో ఓ రేటున్నాది. దాన్లో మళ్లీ ఎజమానికి అయిదురూపాయలు అప్పు పెట్టడమట. ఇదేం సోద్దెమమ్మా ?"

"అవునమ్మా, దానిపేరే రౌడీ మామూలు. అది కొట్టేసుకునే దబ్బులిస్తాడు."

"అది సరే, మన దగ్గర అడుక్కుతినే మిల్లోడికి ఇది సాల్దంలేదట. ఇకనించీ పదిరూపాయల నిచ్చమెయ్యాలట. ఆ శివుడూ*, మిల్లోడూ కల్సిపేసిన నిరవాకం. మన పాయానికి ఒచ్చినట్టే ఒచ్చి శివుడు అదితో కల్సిపోతాడా ? ఈ మొనగాడు ఎవరేపున్నట్టు ?"

"ఓలమ్మో లమ్మో దరమ పెబువులా ఒచ్చి తియ్యటి కబుర్లు సెప్పి, ఎజమాని వంకలో దూరేడన్నమాట. ఇకను యిల్ల ఆటలు సాగడానికి ల్లేదు. సావోరేవో తేలాల్సిందే."

అలాగే ఏడు నెలలు గడిచిపోయాయి. ఒక కార్మిక కుటుంబం ఏ పాటూ పంటా లేకుండా ఏడునెలలు గడపడం మాటలు కాదు. ఎప్పటికప్పుడు ఏవో ప్రయత్నాలు, ధర్నాలు, సంప్రదింపులు, చలో హైద్రాబాదులు, సెక్రటేరియట్ ముందు బైఠాయింపులూను.

ఇంకా ఏదో జరగబోతోందనే ఆశ

"అదిగో కోర్టు తీర్పు"

"ఇదిగో ఎజమాని అరెస్ట్"

"ఇంకేముంది అన్నీ సజావుగా పరిష్కారమవుతాయి"

ఏదీ, ఏం జరిగిందీ ? కనుచూపు మేరలో మిల్లు తెరిచే మార్గం కనిపించడం లేదు. మరోదారి వెదకాలి.

జనవరి 29 : కార్మికులందరూ పొలోమని బయల్దేరి సుశిక్షిత సైనికుల్లా రైలుపట్టాల మీద బైఠాయించారు. ఇదో నిరసన కార్యక్రమం. మహిళలు మరింత

---

*శివుడు=సాంబశివరాజు (అప్పుడు 'కార్మిక నాయకుడు' ఇప్పుడు కాంగ్రెసు మంత్రి)

దరగ్గా ముందు పీటిన నిలబడ్డారు. పోలీసులూ, ఉక్కుటోపీలూ వాళ్లకి వాళ్లు దీగ బడ్డం కనిపిస్తూనే వుంది. గంటలు గడుస్తున్నాయి. గర్జిస్తూ వచ్చిన రైళ్ళు ఆగి పోయాయి. మరి ముందుకి కదలవు. పట్టాలమీద వున్నవి వుత్త మానవ సమూహాలు కావు, కార్మిక శక్తి. మేడేనాడు తమ హక్కులకోసం రక్తం చిందించి జెండని ఎరుపెక్కించి పోరాడిన అజేయమైన కార్మికశక్తి.

"లేవండి లేవండి రైలు వెళ్ళాలి."

"లేవం, లేవం, ఎన్నాళ్ళిలా కడుపుమంటతో మేం చావాలి?"

ఫెళ ఫెళా లాఠీల చప్పుడు. జనం పరుగులెడుతున్నారు. మళ్లా కూడు తున్నారు. శత్రువుల గురి మాత్రం నాయకుడి మీదే. ప్రజలు పసికట్టారిది. అక్కడందరూ నాయకుడిని చుట్టేశారు. అన్నలు దన్నుకాశారు. దాప్పవాయువన్నారు. కళ్ళు మండకుండా ఉల్లిపాయలు అడ్డం పెట్టుకున్నారు కార్మికులు. (వూహించిన పుద్దమేగా ఇది?). అయినా కళ్ళు మండుతున్నాయి. కాని జనం పట్టాలమీంచి తప్పుకో లేదు. వెంటనే తుపాకిలమోత. ఎక్కడబడితే అక్కడ కాల్పులు. ఒక కామ్రేడ్ నుదుటిమీద గుండు దూసుకుపోయింది. మరో కామ్రేడ్ పక్కటెముకల్లోకి. ప్రసాదన్నని లాక్కుపోతున్నారు పోలీసులు. కొడుతున్నారు. అవతలివేపు నుంచి గన్ను గురి చూస్తోంది. గభుక్కున అన్నని కావలించుకున్నాడు కామ్రేడ్ సత్యనారాయణ. పోలీసు బయొనెట్ కడుపులోంచి గుచ్చుకుపోయింది. నేల కారిగాడు. జనం ఇంకా 'శాంతి పోరాటం', 'ధర్మపోరాటం' అంటూ పూరకుండలేరు. చేతికి దొరికింది దొరికి పట్టు విసిరారు. ఆత్మరక్షణ కావాలిగదా? కొనవూపిరితో కొట్టుకుంటున్నవాళ్ళు, కాళ్ళూ చేతులూ కోల్పోయినవాళ్ళు— అయ్యో, అన్న కన్ను ఏమయింది? సోయ లేకుండా పడిపోయాడా?....

చెట్టుకొకరు గుట్టకొకరు— ఆ రాత్రి కాళరాత్రే అయింది. వెంటాడుతున్న పోలీసుల్ని తప్పించుకోడానికి మహిళలందరూ కొండల్లోకి దారితీశారు. గాయాలతో, అటో ఇటోగా వున్నవాళ్ళతో విశాఖపట్నం గవర్నమెంట్ ఆస్పత్రి (కె.జి.హెచ్.) కిటకిటలాడింది. రాత్రికి రాత్రే వార్తాపత్రికల ఫోన్లన్నీ గోలపెట్టేశాయి.

మర్నాడు ఆదివారం. ఏం జరిగిందో ఎలా వున్నారోనని ఆస్పత్రి వరం డాల్లో జనం గుమిగూడారు. కంటిదగ్గర బాండేజి, ఒంటిమీద వాతలు, కాళ్ళకి

దెబ్బలు— జరిగిందేమిటో అన్న అలా చెప్పుకుపోతున్నారు. పక్కమంచాలమీద స్పృహలేనివాళ్ళు, ఆక్సిజన్ సిలెండర్లు, సెలైన్ బాటిల్సు, హడావుడిగా డాక్టర్లు, నర్సులు. కాని పక్కనే అసాధారణ దృశ్యాలు. ఒళ్లెరక్కుండా పడివున్నవాళ్ళ చేతులకి మంచానికి కలిపి బేడీలు! వరండా నిండా పోలీసులు, ఎవరెవరు వస్తున్నారో రాయడానికి గద్దకళ్ళ సి.ఐ.డీలూను.

మరో కార్మికుని మరణం

మార్చ్యురీలోకి మరో దేహం

అయిదుగురి రక్తతర్పణం. మరికొందరి కళ్ళు చేతుల బలిదానం, మరెంతో మంది గాయాలు.

పరామర్శకి వచ్చే ఓట్ల నాయకుల సంరంభం. "ప్రతిపక్షం వాళ్ళొస్తే మేమేనా తక్కువతిన్నది?" అని హుటాహుటి అధికారపక్ష నాయకుల పర్యటనలు. వాళ్ళ పాలనలోనైనా, వీళ్ళ పాలనలోనైనా ప్రజలకి ఒరిగిందేముంది?

"అయ్యో, చేతులకి బేడీలేవిటి, తీసెయ్యండి!" (వేయించిందీ వారే, తీయించిందీ వారే!)

"ఇదిగో రేపే మిల్లు తెరిపిస్తున్నాం. యజమానితో సంప్రదిస్తున్నాం."

మరింక శవపరీక్ష లయిపోయాయి. అర్ధరాత్రి శవాల్ని అప్పగించేస్తే అంతా నిశ్శబ్దంగా సజావుగా సాగిపోతోందని మరో గూడుపుఠాణి.

"వీల్లేదు వీల్లేదు. మా అన్నల్ని జనం మధ్య పట్టపగలే అప్పగించాలి."

వాన్‌లో మృతదేహాలు, ముందూ వెనకా బందోబస్తు వాన్‌లు.

పొలాల గట్లమీద బారులు తీరిన జనం— తమ కార్మిక సోదరుల్ని భుజాన మోస్తూ 'జోహార్', 'జోహార్' అని నినదిస్తూ. పడుతూ లేస్తూ మహిళలు పరుగు.

జరజాపుపేట శ్మశానవాటిక నిండిపోయింది. మహిళా కార్మికశక్తి పెల్లుబికింది. కళ్ళు ఒత్తుకోవడాలు, పూలు విసరడాలు, తమ అందరి కోసం ప్రాణాలర్పించిన తమతోటి కామ్రేడ్స్‌ని ఆఖరిసారి చూడాలనే తొందర.

ష్....ష్.... ఎవరో మాట్లాడుతున్నారు.

కామ్రేడ్స్, మన అమరుల సంస్మరణగా రేపుదయం పన్నెండుగంటల వరకు నిప్పు రాజెయ్యొద్దు. ముద్ద ముట్టొద్దు— అదే మన నివాళి.

అంతే.... అంతే.

"కామ్రేడ్స్, మనం ధర్మ పోరాటం, శాంతి పోరాటం చేశాం. అయినా మనకి లాఠీలు, తుపాకులు తప్పలేదు. మనకోసం మన సోదరులు ప్రాణాలిచ్చారు...."

గొంతు పూడుకుపోయింది జనం గొల్లుమన్నారు.

మరో గొంతు– "కామ్రేడ్స్, ఏడునెలలుగా పోరాటం కొనసాగిస్తూనే వున్నా ఎవరికీ చీమ కుట్టినట్టయినా లేదు. మనం మాత్రం ప్రాణాలు పోగొట్టుకుంటున్నాం. మనని పావుల్లా వాడుకోవాలని చూస్తున్న వినాయకుల్ని మేనేజిమెంటుని ఒక కంట కనిపెట్టే వుండాలి. పోరాటాన్ని కొనసాగించాలి.

"కామ్రేడ్స్, విరసం స్నేహహస్తం మీకెప్పుడూ తోడుంటుంది. మీ పోరాటం కథలుగా, తీర్మానాలుగా ముందుకి తీసుకుపోతూనే వున్నాం. నెహ్రూ నాటినుంచీ పాలకవర్గాలది ఇదే సంప్రదాయం. ఆంధ్రరాష్ట్రం కోసం ఆందోళన చేసినప్పుడూ అంతే. పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష చేసి చచ్చిపోతే, తుపాకి గుళ్ళకి కొందరు బలి అయితేనే గాని మనకో రాష్ట్రమంటూ ఏర్పడలేదు. ఇప్పుడూ అంతే. లాకౌట్ ఎత్తేసి మిల్లు తెరవాలన్న తీర్పుని ఖాతరు చేయని యాజమాన్యం, మిల్లు తెరిపించే బాధ్యతని నెరవేర్చలేని అసమర్థ ప్రభుత్వం ఇప్పుడు అయిదుగురు కార్మికులు రక్త తర్పణం చేస్తేనే గాని 'రేపో మాపో మిల్లు తెరుస్తాం' అని ప్రకటించక తప్పలేదు. అందరూ కలిసికట్టుగా పోరాటం కొనసాగిస్తేనే తప్ప దేన్నీ సాధించలేరు...."

"ఏయ్, ఏమిటా ఉపన్యాసాలు ? ఇంకా ఎంతసేపు ? ఆ తతంగం త్వరగా ముగించండి. తగలెట్టేసెయ్యండి. 144 సెక్షనుంది. ఆఁ" అంటూ ఖాకీ దుస్తుల, లాన కరుపుల అథార్టీ.

"సూడమ్మా మావాళ్ళని నంపింది పాలక సొశానంలో కూడా యీ సెక్స నంట. నచ్చినోల్లని కడసారి సూసుకోడానిక్కూడా యీల్లు పెర్మిసనంట. ఈల్లు అథార్టీ మంద. కపటమంతా కాకీబట్టల్లోనే వుంది. ఈ సంగతి మాకు బాగా తెల్సిపోయింది. మా పిల్లలక్కూడా యిదే నూరిపోస్తాం. మా కుక్కలక్కూడా ఇదే నేర్పుతాం. ఇక్కడ కూడా మమ్మల్ని విడిపోనీరా ?

"ఆ సివుడు పే_త్తన్నాడే రాజకీయమంతా. అదు సెట్టు ఆకులక్కూడా రాజకీయం నేర్పిత్తాడు. సెట్టు పూలు పూయకూడదు. పళ్ళు కాయగూడదు. ఆకులతో సహా ఎండిపోయి సెట్టు సావాల. అదీ ఆడి ఎత్తు. మా(చెప్పుడో అయన్నీ తెల్సుకున్నాం. రౌడీ మా(వూలు పెంచాడు. మనం ఎజమానులకి అప్పియ్యాలంట. దాని పేరే అది.

"మాము శాంతి యుద్ధం పే_స్తన్నాం. దరమ యుద్ధం పే_స్తన్నాం. లేపోతే మాం కారప్పొడి తీసుకెళ్లేవాల్లం కాదా ? అయినా శవాలు కళ్లబడ్డాక యింకా శాంతేమిటి ? సచ్చినోల్లు మా అన్నసీ మమ్మల్నీ కాల్పేద్దామనే ఆల్ల ప్లాను. మా అన్నవి కాపాడుకున్నాం. మా పోరు అగదు. మా వూల్లో పద్దెనిమిదీ సీదపురుగు లున్నాయి కావా ? ఆటిని ఆడి త్తన్నాడు శివుడు. ఈ ఎత్తులన్నీ ఎలాగ సిత్తు పేయాలో మాకు తెలుసు. మాం పోరాడతాం" అని దృఢంగా పలికిందో 'ముత్యాలమ్మ' జజ్జాపుపేటలో (నెల్లిమర్లకి అమడ దూరం) జీవితంలోంచి వచ్చిన ముత్యాలివి.

వాళ్ళ పోరాటం ఆగదు. నాగవంశానికి చెందినవారైనా జాలర్లయినా పోరాటంలో తేడా లేదు. అందరూ కలిసి మెలిసి వుద్యమిస్తున్నారు.

కా(మేడ్స్ కాళ్ళ అప్పల సత్యనారాయణ, దువ్వారపు చిన్న, వల్లి ముత్యాల నాయుడు మరో ఇద్దరు కా(మేడ్స్ చేసిన రక్తతర్పణం వృథా కాదు.

ఒకరి కష్టంమీద ఒకరు బతికినంతకాలం కమ్యూనిజానికి కాలం చెల్లదు. అందుకే 'ఖబడ్దార్ ఖబడ్దార్ కంపెనీలవాడా !' అంటూ కదిలింది కార్మిక సేన. మార్క్సిస్టు సిద్ధాంతం వెలుగులో ఇప్టూ నాయకత్వాన నిర్మాణయుతంగా ఒక్కతాటి మీద నిలబడి పోరాటంలో ఆరితేరుతోంది.

"యం(త్రాలను తిప్పినం
ఉత్పత్తులు పెంచినం
మా యుద్ధం ఆగకుండ
విప్లవాలు నడిపెదం" —చెరబండరాజు

—కృష్ణాబాయి

# జనారణ్యంలో జగమెరిగిన 'ఎన్‌కౌంటర్'

ఎన్‌కౌంటర్ అంటే ఎలా వుంటుందో విశాఖ ప్రజలు ఎప్పుడూ చూడలేదు. అయితే ఈ నెల పదహారో తేదీ సాయంత్రం మర్రిపాలెం ప్రాంతంలో మెర్క్యూరీ లైట్ కాంతిలో 'ఎన్‌కౌంటర్'ను చూసే 'దురదృష్టం' విశాఖ ప్రజలకు కలిగింది. అందులోనూ ప్రతి బుధవారం ఆ ప్రాంతంలో సంత జరుగుతుంటుంది గనుక మరింత ఎక్కువమంది ఈ 'ఎన్‌కౌంటర్'ను చూడగలిగారు. సాధారణంగా ఏ చింతపల్లి అడవుల్లోనో, ఏ పాడేరు కొండల్లోనో పోలీసులు, నక్సల్స్ మధ్య 'జరిగే' ఎన్‌కౌంటర్లలో ఇంతమంది చనిపోయారు, అంతమంది చనిపోయారు అనే వార్తల్ని పత్రికల్లో చూడడం తప్ప అసలు ఎన్‌కౌంటర్ అంటే ఏమిటో ప్రత్యక్షంగా చూసే అవకాశం రావడంతో ప్రజలు బిత్తరపోయారు, నివ్వెరపోయారు, నిర్ఘాంతపోయారు. అయితే అక్కడ అందరూ ప్రత్యక్షంగా చూసినప్పటికీ జరిగింది 'ఎన్‌కౌంటర్' అన్న విషయం మరుసటిరోజు ఉదయం పత్రికల్లో చూస్తే గాని తెలియలేదు.

'రాత్రి మనం చూసిందేనా ఎన్‌కౌంటర్' అంటే అనుకున్నారు. సంఘటన చూసిన జనమంతా పోలీసులు దీన్ని ఎన్‌కౌంటర్ అంటే ఎన్‌కౌంటరే మరి అని సరిపెట్టుకున్నవారు కొంతమంది అయితే ఉక్రోషంతో ఊగిపోయిన వారు మరికొందరున్నారు. ఎటొచ్చీ పోలీసోళ్ళతో గొడవ గనుక 'ఎన్‌కౌంటర్' కాకుండా వుండేందుకు నోరుమూసుకు కూర్చొంటున్నారు. పెన్ను పట్టుకొని వార్తలు రాసే రసూల్‌ను 'ఎన్‌కౌంటర్'లో చంపేసిన పోలీసుల పవిత్రనం విశ్వవ్యాప్తమైన తరువాత వంద గన్‌ల కన్నా ఒక పెన్ను గొప్పది అన్న నానుడి మూలపడిపోయింది. 'వంద చాకుల కన్నా ఒక ఖాకీ గొప్ప, వంద పెన్నుల కన్నా ఒక గన్నే గొప్ప' అని చాటడానికి అన్నట్టు పోలీసులు స్వైర విహారం చేస్తున్నా 'ప్రజాస్వామ్యం' నోరు విప్పడానికి భయపడిపోతోంది.

ఆ రోజు మర్రిపాలెం ప్రాంతంలోని భాస్కరగార్డెన్స్‌కు చెందిన ఒక వ్యక్తి 'ఆంధ్రజ్యోతి' కార్యాలయానికి టెలిఫోన్ చేస్తూ 'ఇక్కడ కొంతమంది దుండగులు జీపులో వస్తూ సైకిల్ మీద వెడుతున్న వ్యక్తిని వెంటాడి కాల్చి చంపేసి జీపులో సైకిల్‌తోపాటు ఎత్తుకెళ్ళిపోయారు' అని సమాచారమందించాడు. దీంతో హుటా

హంటిన ఫోటోగ్రాఫర్లతోపాటు పరుగులెట్టిన విలేకర్లకు అక్కడ జరిగిన సంఘట నను ప్రత్యక్ష సాక్షులు పూస గుచ్చినట్టు చెప్పారు. చంపింది ఎవరో తెలియక పోలీసులు కూడా కంగారు కంగారుగా పరుగులెట్టారు. ఏ పోలీస్‌స్టేషన్‌లోనూ ఒక్క ఆఫీసర్ కూడా కనిపించలేదు. "పోలీసులు జీపులో వెడుతూ రెండు రౌండ్లు కాల్పులు జరిపి తరువాత జీపుదిగి ఎదురుగా వెళ్ళి కాల్చేసారు. ఇది అక్కడి ప్రజల కథనం. జీపులో వెళ్ళింది పోలీసులని, కాల్చివేయబడ్డ వ్యక్తి నక్సలైట్ అని అక్కడి ప్రజ లెవరికీ తెలియదు.

అయితే అనుకున్నట్టే తరువాత పోలీసుల కథనం వచ్చింది. ఆత్మరక్షణ కోసమే నక్సలైట్ జయపాల్‌పై కాల్పులు జరపాల్సి వచ్చిందని సంజాయిషీ ఇచ్చారు. "ఆరోజు సాయంత్రం ఏడున్నర గంటలకు తెలిసిన సమాచారం ప్రకారం మాస్టర్ రవి ఎలియాస్ కిషోర్ అన్న, సత్యం అన్న సి.పి.ఐ. (ఎం.ఎల్.) పి.డబ్ల్యు.జి. గ్రూపు అండర్‌గ్రౌండ్ కేడర్ నక్సలైటు మరియు అతని ఇతర అనుచరులు ముగ్గురు మర్రి పాలెం పెట్రోలుబంక్ దగ్గరకుచేరి రహస్య సమావేశం జరుపుటకు విశాఖపట్నంలో అ రాత్రి ఉన్నత పోలీసు అధికారులను చంపు టకు సన్నాహం చేయుచున్నారని తెలిసి వారి ఆచూకీ తెలుసుకొనుటకు వెళ్ళాం.



పెట్రోల్‌బంక్‌కు 50గజాల దూరంలో ఆగివున్న జయపాల్ వద్దకు 7.35 గంటలకు మరో ముగ్గురువ్యక్తులు మాట్లాడుతుండగా మేము వెళ్ళగా రవి మాస్టారు తనబేగ్‌లో గలపిస్టల్‌తీసి మాపైకాల్పులు జరిపాడు. మేముతప్పించుకొని కిందపడుకుని కాల్పులు చేయవద్దు. మేంపోలీసులం మాకులొంగిపొమ్మని హెచ్చరించినారు. మరలరవిమాస్టారు నక్సలైటే మాపై కాల్పులు జరిపినాడు. అట్టి సమయంలో ఆత్మరక్షణ కోసం నా వద్ద

గల 9 ఎం. ఎం. పిస్టల్‌తో మాస్టారు రవిపై కాల్పులు జరపగా గాయపడి కిందపడి పోయినాడు" అనేది కాల్పులు జరిపిన పోలీసు కానిస్టేబుల్ కథనం. దీన్నిబట్టి నక్సలైట్ల గురించి సమాచారం తెలిసిన అయిదు నిమిషాల్లోనే వారి ఆచూకీని ఖాకీలు సునాయాసంగా తెలుసుకున్నారన్నమాట. ఏడున్నరకు సమాచారమందితే ఏడు ముప్పై అయిదు నిమిషాలకల్లా ఆచూకీ తెలుసుకోవడం ఎదురుకాల్పులు చేసేసుకోవడం కూడా జరిగిపోయిందన్న మాట. ఇది పోలీసులు చెప్పారు గనుక అందరూ నమ్మాల్సిందే మరి! నగరం నడిబొడ్డున జన సమక్షంలో జరిగిన ఈ 'ఎన్‌కౌంటర్'ను చూసాక జనాలకు పోలీసులపై వున్న 'నమ్మకం' బాగా పెరిగిపోయింది. మొత్తం మీద 'ఎన్‌కౌంటర్' అంటే ఎలా వుంటాయో విశాఖ నగర ప్రజలకు అర్థమైపోయింది.

కాబట్టి నీతి ఏమిటంటే—ఎన్‌కౌంటర్ ఎక్కడ జరిగినా, అరణ్యంలో జరిగినా, జనారణ్యంలో జరిగినా, ఏ సెంటర్‌లో జరిగినా ఎన్‌కౌంటర్ ఎన్‌కౌంటరే. ఇందులో నక్సలైట్లే పోతుంటారు. పోలీసులు నిరపాయంగా తప్పుకుంటారు.

## కుక్కగారు తప్పిపోయారు

ఈ మధ్య మూడవ టౌను పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టర్ నుంచి వచ్చిన ఒక ప్రత్యేకమైన పత్రికా ప్రకటన చూసి అందరూ నివ్వెరపోయారు. అదేమిటంటే డి.ఐ.జి. గారి కుక్కగారు తప్పిపోయారన్నది సారాంశం. డి.ఐ.జి. దొరగారి కుక్క గనుక దాన్ని పోలీసు యంత్రాంగమంతా గౌరవించుకోవలసిందే కదా! ఒకవక్క రాష్ట్ర హోమ్‌మంత్రి అలపాటి ధర్మారావుగారు, డి.జి.పి. టి. ఎస్. రావుగారు నగరానికి వస్తున్న సందర్భంలో సందట్లో సడేమియా అన్నట్టు ఈ ప్రకటనను ఇచ్చి పోలీసులు తమ దొరభక్తిని చాటుకున్నారు. ఈ కుక్క గారికి కరిచే గుణముందట. అయినా ధైర్యంచేసి పట్టుకున్నవారికి రివార్డు కూడా ఇస్తారట. కుక్కలు పట్టే వారికి భలే మంచి అవకాశమే మరి. అయితే ఎప్పుడైనా పొరపాటున మా పిల్లాడు తప్పిపోయాడు కాస్త వెదికిపెట్టండి బాబూ అంటూ ఏడుస్తూపోయే తల్లిదండ్రులు పోలీసు స్టేషన్లలో ఎంత మర్యాద పొందుతారో తెలియదుగాని కుక్కగారి కోసం మాత్రం గాలింపు మొదలైంది ఈ కుక్కగారికి తప్పిపోవడం కొత్తేమి కాదు. 'వెదికే వాళ్ళు మనవాళ్ళయితే ఎన్నిసార్లయినా తప్పిపోవచ్చు' అనుకుందో ఏమో గత ఏడాది కూడా తప్పిపోతే కష్టపడి వెదికి పట్టుకున్నారు. మరి ఇప్పుడెన్నాళ్ళు పోలీసులు 'కుక్క వేట' సాగిస్తారో.

— వి.వి. ఆర్

[ఆంధ్రజ్యోతి 21-2-94 సౌజన్యంతో—సం]

# కామ్రేడ్ జయపాల్ అమర్ హై

రోడ్డుపై నడిచిపోతున్న ప్రజల మీద హఠాత్తుగా రాజ్యాంగ యంత్రం పడగనీడ కమ్మేస్తుంది. వీధిలైట్ల వెలుతురులో, ప్రక్కనే ఉన్న చీకట్లలో అంత వరకూ స్నానం చేసిన నగరం హఠాత్తుగా దెబ్బతిన్న లేడిలా వణికిపోతుంది. దోపిడీదారుల గుండెల్ని, శత్రువుల మెదళ్లను అంతవరకూ బేజారెక్కించిన ఓ ప్రజా వీరుడి నీడని పసిగట్టిన రాజ్యం పోలీసుజీపుగా అవతారం ఎత్తుతుంది. ఆ జీపుకి నెంబర్లు కానీ, దాన్ని నడిపేవాళ్ళకి లైసెన్సుగానీ ఏమీ అవసరంలేదు ఈ 'నాయక' రాజ్యంలో. ప్రజల ముద్దుకూనని, ఓ కన్నతల్లి కొంగుబంగారాన్ని, ఆమె కడుపులో ఓ పేగుని, కత్తుల కరీంనగర్ పోరు బిడ్డని రేచుక్కల్లా వెంటాడి కూల్చే సివ ఖాకీలు విశాల ప్రజల్ని గొప్ప గొర్రెలుగా భావించి పాతపాటే మొదలెట్టేస్తారు. ఆలివ్ గ్రీన్ రంగు జీపు పళ్ళికిలించి ఆత్మరక్షణ కథలల్లుతుంది. వందలమంది కూడి ఉన్న సంతలో ఓ ఎర్ర పావురాన్ని రాజ్యం తుపాకులు బలిగొంటాయి.

ఘాతుకం జరిగిందంటూ పారిశ్రామికవాడలో గాలి ప్రజల్ని అప్రమత్తుల్ని చేస్తూ అత్యవసర సైరన్ మ్రోగిస్తుంది. ప్రపంచ వార్తల్ని మోసుకొస్తూ ప్రజల్ని పలకరించడానికొచ్చే వార్తాపత్రిక తనలో ఆత్మరక్షణ కథలు అచ్చయినప్పుడల్లా కళ్ళ నీళ్ళ పర్యంతం అవుతూనే ఉంటుంది. వార్త తెలియని ఆ కన్నతల్లి యింకా కొడుకొస్తాడని గుమ్మందగ్గర కూర్చుని చూస్తూనే ఉంటుంది. ఉట్టిలో దాచిన చద్దన్నం పులిసిపోతోంది.

* * *

క్షణం క్రితం వరకూ ప్రజల్ని కలిసి, వారి గాయాల్ని నిమిరి, వారి ప్రేమలో మునిగిన ఆ దేహం తనను అవసరమైనప్పుడల్లా తల్లిలా నిండుగా మోస్తూ గమ్యాన్ని చేర్చే సైకిలును—'అలు పెరుగక నన్ను మోస్తున్నావే! నీ ఋణం ఎలా తీర్చు కోను?' అని గుండె లోతుల్లోంచి అడుగుతుంది. ఆర్తిగా తడుముతుంది. ఆ వ్రేళ్ళలోని ఆర్ద్రతకి సైకిలు నిలువునా పులకరిస్తుంది. ఒడిలో చంటిపాపకి పొల మారితే బాధపడే తల్లిలా - ఆ దేహానికి తగిలిన తూటా దెబ్బలకి ఆ సైకిలు నిలువునా

వణికిపోతుంది ఖోరుమని ఏడుస్తూనే తన చెలికాడు చివరిశ్వాస వదిలినంతవరకూ తోడు ఉంది పిడికిళ్ళు ఎత్తి లాల్‌సలామ్ చెబుతుంది. ముడతలు తేరిన ఆ తెల్ల చొక్కా నిండా ఎరుపురంగుకి మారితే - బొళక్కు బొళక్కుమని ఒలుకుతున్న రక్తాన్ని తనలోకి పీల్చుకుని గుంభనంగా పంటిబిగువున బాధనీ, కోపాన్నీ అదిమి పెట్టిన ఆ నల్లపాంట్ మరొక్కసారి ఆ విప్లవకారుడి దేహాన్ని ఒళ్ళంతా చేతులే చేసుకొని ప్రేమగా తడిమి గుడ్లనీరు కుక్కుకుంటుంది. భవిష్యత్తుని నిర్దేశించే మెదడు శాశ్వతంగా నిద్ర కుపక్రమిస్తే అరమూతలు పడి అడ్డదిడ్డంగా చెదిరిన కంటి పాపలు పేపరుద్వారా తన మొహాన్ని మొదటిసారి కొందరికీ, చివరిసారిగా అందరికీ చూపిస్తూ ప్రజావీరులకి మరణం లేదంటున్నాయి. గుండెలనిండిన దుఃఖా ర్ణవతల పారబోసేసి, ఆశయాన్ని నింపుకోమంటున్నాయి. తోటి విప్లవకారులకి రెడ్‌శాల్యూట్స్ చెబుతున్నాయి. విప్లవం వర్ధిల్లాలని వివరిస్తూనే ఉన్నాయి.

o o o

సముద్రం ఖోరుమని ఏడుస్తూనే ఉంది. యారాడకొండ తల బాదుకుంటూనే ఉంది. నేలమీద ఒలికిన ఆ అమరుడి నెత్తుటి మడుగు రాజ్యహింస నెదిరించి విప్లవాన్ని విజయవంతం చేయండంటూ ఈ నేస్తాలకి పిలుపిస్తోంది. మత్రిపాలెం వీరు బాటనే ఎంచుకుందిప్పుడు.

కొద్ది కొద్దిగా కొండంత దుఃఖాన్నధిగమిస్తున్న విశాఖ ఈ మావో వారసుడి నెత్తుటి బాకీ వసూలు చేయడానికి — తానే మరో కరీంనగర్ కావడానికి ముందు కురుకుతూ — మరింతగా ఎలర్ట్ అవుతోంది.

—నవేరా

17-2-94

---

# అడవి నుంచీ నగరానికి....

అడవుల్లో తూటాలు పేల్చి పేల్చి విసుగొచ్చిన పోలీసు తుపాకికి ఒక్కసారి నగరంలో పేల్చాలనిపించింది. ఇక్కడ ఎంత పేల్చినా ఏ నా కొడుకూ భయ పట్టం లేదు. తుపాకులు, లాఠీలు చూసినప్పుడు నిశ్శబ్దంగా అయిపోతాయి పల్లెలు. వాటిదే హడావిడంతా. అయి తిరిగి ఎలిపోయినాక మళ్లీ ఏటవుద్దో! అందరూ ఆటలే, పాటలే, పనులే. పనులంటే, పొలం పనులే కాదు. అన్నల పనులుకూడా చేసేస్తారు. ఇక ఇక్కడ మన మాటెవరూ యినరు.

నగరంలో అందరూ చదూకున్న నా కొడుకులు. ఆల దగ్గర తుపాకులుండవు. ఆల కళ్ళే తప్ప మరేటి పనిచెయ్యవు. అందుకే ఆలకి ధైర్యం తక్కువ. ఆలని భయపించడం తేలిక. ఆల భయం చూస్తే కానీ మనకి అడవిలో పోయిన ధైర్యం తిరిగి రాదు.

మరిక పద నగరానికి....

ధన్....ధన్....ధన్....

ఎట్టి ఎదురుగా వున్న మనిషిని ఇలా కాల్చేపే అవకాశం దొరకలేదు ఇంత వరకూ. అడవిలో అయితే ఇలాగ కుదిరేదా ? అబ్బే !

ఇక ఆగడమెందుకు ? వరానగా పేల్చేద్దాం. ధన్....ధన్ ...ధనా....ధనా....

ధన్....ధన్....ధన్....ధన్....ధన్....

దట్టంగా కమ్ముకున్న పొగ వల్ల కాసేపు తుపాకికి ఏమీ కనిపించలేదు. పొగ పీడి మసకబోయాక చూస్తే....

వరసనే హారంలా మనుషులు. ఆల్లవొంటి మీద సరైన బట్ట లేదు. తల మాసి ఉంది. చేతుల్నిండా, కాళ్ల నిండా మట్టి, దుమ్ము, ధూళి. ఆలా కదలకుండా నుంచోనున్నరేటి ? అయి బొమ్మలా, శవాలా, మనుషులా ? !

చూద్దామని తుపాకి వాటికి దగ్గరగా వెళ్ళింది. ఒక మనిషిని ముట్టుకుంది. అంతే ! విద్యుద్ఘాతం తగిలినట్టయింది. ఇదేంటిది ? .... అమ్మో .... అవును .... ఇదేంటో తనకు బాగా తెలుసు. అడవిలో సరిగ్గా ఇలాగే ఉండేది ఏ పల్లెకెల్లినా ! ఇక్కడ....ఏమీ లేవి ఈ నగరంలో అదెలా సాధ్యమయ్యింది ? !

అమ్మో. ఇకిలా ఉంటే లాభంలేదు—ఎల్లిపోవాల. తుపాకీ వెనక్కి తిరిగి పరుగందుకుంది. స్టేషన్ దగ్గరకు రాగానే తక్కున ఆగిపోయింది. అక్కడ ఎవ్వరూ లేరు. మెల్లగా లోపలకు అడుగు పెట్టింది. స్టెన్‌గన్నూ, లాఠీ, 303 ఏమీ లేవు. ఆయుధాల గది ఖాళీ.

ఒక్కసారి భయం కమ్ముకొచ్చింది తుపాకీకి. పారిపోదామని అనుకునేంతలో గట్టిగా నినాదాలు వినిపించాయి. భయం భయంగా కదిలింది ట్రిగ్గర్—కానీ తూటా బయటకు రాందే ఒంటరి తుపాకీ ఒక్క మూలుగు మూలిగి, కుప్పకూలిపోయింది.

***

16-2-94 న విశాఖపట్నంలో మర్రిపాలెం అనే ప్రాంతంలో సాయంత్రం 7-30 గంటలకు పోలీసుల దొంగ ఎదురు కాల్పులలో అమరుడైన కామ్రేడ్ జయపాల్‌కు ఎర్రదండాలు.

— సంద్రి

---

స్వీకారం :

1) కవితా ఓ కవితా - తెలుగు వచన కవితా సంకలనం 1989-90. సంపాదకులు : పాపినేని శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణ. వెల : 50 రూ. ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2.

2) "కొండ"ని తవ్వి "ఎలక"ని కూడా పట్టనట్టు! బాలగోపాల్ రాసిన "చరిత్ర, మనిషి, మార్క్సిజం" మీద చర్చా వ్యాసం. రచన : రంగ నాయకమ్మ. వెల : 12 రూ. ప్రతులకు : అరుణా పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

3) జీవిత చిత్రం (కథలు) - పుప్పాల కృష్ణమూర్తి. వెల : 12 రూ. లైబ్రరీ ప్రతి : 20 రూ. ప్రతులకు : ప్రజాశక్తి బుక్ హౌస్, కార్ల్ మార్క్స్ రోడ్, విజయవాడ-2.

* * *

# చర్చ

# వైయక్తికత, నూతన సాంఘిక ఉద్యమాలు: నాయకత్వం సమస్య

## బాలగోపాల్ వ్యాసానికి ఒక ప్రతిస్పందన

"చరిత్ర, మనిషి, మార్క్సిజం" అనే పేరుతో బాలగోపాల్ రాసిన వ్యాసం (సెప్టెంబర్ 93 సంచిక అరుణతార) ఆంధ్రలో ఒక చర్చను ప్రారంభించటానికి దోహదం చేసింది. ఈ వ్యాసానికి సంబంధించి రెండు ప్రధాన విషయాలపై దృష్టి కేంద్రీకరించి మా అభిప్రాయాలను ఇక్కడ చర్చించ దల్చుకున్నాం.

మొదటిది : వైయక్తికత, రెండవది : సాంఘిక వ్యవస్థ రాజకీయాలు లేదా రోజువారీ రాజకీయాలు. స్త్రీల ఉద్యమం దళిత ఉద్యమం వంటి సాంఘిక ఉద్యమాల ప్రాముఖ్యతని అర్థం చేసుకోవాలన్నా సోషలిస్ట్ రాజకీయ చొరవలతో నాయకత్వం గురించి అర్థం చేసుకోవాలన్నా, సోషలిజం అంతిమ లక్ష్యాల గురించి అర్థం చేసుకోవాలన్నా మా దృష్టిలో పై అంశాలు చాలా ముఖ్యమైనవి.

బాలగోపాల్ వాదనలో సంప్రదాయ మార్క్సిజం, 'వైయక్తికత' అనే అంశాన్ని సదా నిర్లక్ష్యం చేస్తూనే వచ్చింది. ఆయన మాటల్లో "సోషలిజం, సమ సమాజం అనే ఆదర్శాలే ఈ రోజు సంక్షోభంలో ఉన్నాయి. సోవియట్ రష్యా, చైనా తదితర దేశాలలో వచ్చిన రాజకీయ మార్పులకు పాక్షికమైన జవాబు చెప్పి ఊరుకోకుండా సంక్షోభాన్ని సంక్షోభంగాస్వీకరించి చర్చిస్తే మార్క్సిస్ట్ అవగాహనలో ఉన్న కొన్ని ఖాళీలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి." వీటిలో ప్రధానమయినది మానవ ప్రవృత్తికి సమసమాజ ఆదర్శానికి మధ్య నున్న జవాబు దొరకని ప్రశ్న. సోషలిస్ట్ రాజకీయాలలో 'వైయక్తికత' గురించిన అవగాహన లోపించిందన్న బాలగోపాల్ వాదనతో మేం ఏకీభవిస్తున్నాం. (ఇక్కడ మానవ ప్రవృత్తి అనే మాటకు బదులుగా వైయక్తికతను వాడటం జరిగింది) అయితే ఇంక కొంత ముందుకు సాగి, అవగాహన లోపించిందన్న గుర్తింపు మాత్రమే సరిపోదనీ, ఆ వైయక్తికతను ఏ విధంగా రాజకీయ అంశంగా మలుచుకోవాల్సిన అవసరం ఉందనే విషయం ఈనాడు

మన ముందున్నదని స్పష్టం చేయదలుచుకున్నాం. వైయక్తికతను ఒక రాజకీయ అంశంగా మలచకపోతే సోషలిస్టు సమాజ సాధనకు అది అడ్డుగా నిలవటమో లేదా ప్రయత్నాన్ని వెనక్కి లాగటమో చేస్తుందని అర్థం చేసుకోవాలని వస్తుంది. అణచివేతకు గురవుతున్న రకరకాల గ్రూపుల ఆశలు, ఆశయాలకు నిజమైన ప్రాతినిధ్యం కలిగించేవిగా ఆ సోషలిస్టు లక్ష్యాలకు ఒక కొత్త నిర్వచనాన్నివ్వటానికి వైయక్తికతను రాజకీయం చేయటం అతిముఖ్యం అని వాదించ దల్చుకున్నాం. అంతర్లీనంగా మనలో ఎక్కడో రహస్యంగా దాక్కుని చారిత్రక భౌతిక వాద అవగాహనకి అంతుచిక్కని అంశంగా వైయక్తికత అనే పదాన్ని వాడటం మా అభిమతం కాదు. దాని బదులుగా రోజువారీ రాజకీయాలతో ఏ విధంగా "వ్యక్తుల" ఉనికి ఏర్పడుతుందని చర్చించ దల్చుకున్నాం. రోజువారీ రాజకీయాలంటే మా ఉద్దేశ్యం "సాంఘిక వ్యవస్థ" (సివిల్ సొసైటీ గ్రామ్‌సీ పదం) రాజకీయాలే. మన దైనందిన జీవితంతో అన్ని రకాల సంస్థలు (Institutions), వాటితో మన సంబంధాలు, వ్యక్తులుగా పరస్పరం మనమధ్య వున్న సంబంధాలన్నీ కూడా ఆ "సాంఘిక వ్యవస్థ"లో భాగమే. సాంఘిక వ్యవస్థలో సంస్థలు అంటే కుటుంబం, బడి, మతం, సాహిత్యం, ప్రచార సాధనాలు- వీటన్నింటితో మనకున్న సంబంధాల్ని నిర్వచిస్తూ, మన వైయక్తికతను రూపొందిస్తాయి. ఈ సంస్థల మూలంగా సమాజంలో మనం "సరైన వ్యక్తులుగా" ఎలా మసలు కోవాలో నేర్చుకుంటాం. "బుద్ధిమంతులైన" అమ్మాయిలుగా, మంచి విద్యార్థులుగా, సంసార పక్షమైన స్త్రీలుగా, మంచి గృహిణిలుగా ఎలా వుండాలో, మేధస్సు అంటే ఏమిటో దాన్ని ఎట్లా సాధించాలో, మంచి కార్మికులుగా; టీచర్లుగా; మానేజర్లుగా మన ప్రవర్తన ఎట్లా ఆదర్శవంతంగా ఉండాలో మనం నేర్చుకుంటాం. ఆ విధంగా కుటుంబంలో, బడిలో ఇతర సంస్థలలో కులానికి, వర్గానికి, లింగానికి, జాతికి- ఇతర అన్ని రకాల అణచివేతలకు సంబంధించిన మన వివిధ రకాల వైయక్తిక స్థానాల్ని మనం సాధిస్తాం. ఆ వైయక్తిక స్థానాల్నే (Subject Positions) మన ఆచరణలో ప్రతి అంశంలోనూ వినియోగిస్తాం. ఈ ఆచరణల్లోని కులతత్వం, స్త్రీ వివక్షలు చివరికి దళితులకు, స్త్రీలకు కూడా స్ఫురించని సూక్ష్మ పద్ధతుల్లో కొనసాగుతుంటాయి. ఈ విధంగా కంటికి కనిపించకుండా నడిచే అణచివేతను పాత మార్క్సిస్టు సిద్ధాంతాలు 'స్వచ్ఛమైన' మానవ ప్రవృత్తిని మరుగుపరిచే అబద్ధపు చైతన్యం (False Consciousness)

గా సూత్రీకరించాయి. 'అంగీకారం' (Consent) ఒక క్రమంలో రూపొందించడం లేదా నిర్మించడం ద్వారా సిద్ధాంతం సమాజంలో ఎలా వేళ్ళూనుకుంటుందో వివరించాయి. తర్వాతి సూత్రీకరణాలు ప్రకారం వ్యక్తులు ఇష్టపూర్వకంగా 'అధికారం' నిర్వహించటంలో కర్తలుగా (Subjects) ఎలా బాధ్యత వహిస్తారో స్పష్టం చేయబడింది. సాంఘిక వ్యవస్థలో సంస్థలు కర్తలను (Subjects) రూపొందిస్తే, ఆ సంస్థలను నిర్వహించి, గట్టిపరిచేందుకు కర్తలు బాధ్యత వహిస్తారు.

బూర్జువా సిద్ధాంతాల దృక్పథంతో వైయక్తికతను విశ్లేషిస్తే మానవ ప్రవృత్తిలో స్వచ్ఛమైనదొకటి ఉందనే అవగాహన కలుగుతుంది. కాని, అటువంటి అవగాహన అచారిత్రకమైనది. వైయక్తికతను ఒక రాజకీయ నిర్మాణంగా అర్థం చేసుకోవటం మూలంగా సాంఘిక సంబంధాలను నిర్వహిస్తూ వాటిని పునరుత్పత్తి చేయటంలో దాని కీలక పాత్రను అర్థం చేసుకొనే అవకాశం కలుగుతుంది. సిద్ధాంత నిర్మాణాల గురించి ఈ మధ్య వచ్చిన సూత్రీకరణల ప్రకారం సాంఘిక వ్యవస్థ (civil society)లో సంస్థలు నడిచే పద్ధతి, అవి అధికార నిర్వహించే విధానాలకు కూడా వైయక్తికత ఒక ఇరుసులాగా పనిచేస్తుంది. దీన్నర్థం చేసుకోవటానికి కులం, లింగపరమైన వివక్షలను నిర్వహించే నిర్మాణాలకి మించిన ఉదాహరణలు కనిపించవు. అవి మన ఇంగిత జ్ఞానం (కామన్ సెన్స్)లో జీర్ణించుకొనిపోయి చివరికి వివక్షకూడా 'సహజమైనది'గానే కనిపించటం మొదలవుతుంది. దళితులకు, స్త్రీలకు సంబంధించిన ఈ అవగాహనలు చరిత్రలో భాగంగా ఎలా రూపొందాయో, ఎలా రాజకీయాలలో స్థానాన్ని ఏర్పరచుకున్నాయో మనం చూడలేకపోతాం. కంటికి ప్రత్యక్షంగా కనిపించే హింస - అంటరానితనం, భార్యలమీద భర్తలు చేసే దౌర్జన్యం, వరకట్న మరణాలు - అన్నీ కులతత్వానికి పితృస్వామ్యానికి ప్రధాన లక్షణాలుగా అర్థం చేసుకున్నా ఆహింస కంటే బలమైన, ప్రమాదకరమైన పద్ధతులు ఉన్నాయి. దళితులకు స్త్రీలకు సంఘ సంస్థలలో విజ్ఞాన వ్యవస్థలలో (Knowledge systems) ప్రవేశం లేకుండా చేసే క్రమం, దాని రూపాలు కంటికి కనిపించకుండానే పోతాయి. ఆ విధంగా కంటికి కనిపించకుండా ఉంటాయి కనుకే అవి మరీ ప్రమాదకరం. ప్రత్యక్షంగా కనిపించే హింసను ఎదిరించటం ఒక మేరకు సులభమే. అదే కనిపించకుండా జరిగే హింసను గుర్తించటం ఎదిరించటం కూడా అన్నిరెట్లు 'సమస్య'లతో కూడుకున్నది. సంఘ సంస్థల్లో విజ్ఞాన సంస్థల్లో దళితులు,

స్త్రీలకు ప్రవేశార్హతను విరోధించే క్రమాన్ని చైతన్యవంతమైన కుల దృక్పథంతో లేదా లింగ దృక్పథంతో, ఒక రాజకీయ క్రమంగా అర్థం చేసుకున్నపుడే మనకు దాని అసలు స్వరూపం ఏమిటో అది ఎట్లా పనిచేస్తుందో అర్థమవుతుంది. అగ్ర కులానికి లేదా వర్గానికి చెందిన వ్యక్తి ఎంత మంచి ఉద్దేశ్యం కలిగిన వాడయినా ఎంత "చైతన్యవంతుడయినా" అదే రోజువారీ జీవితంలోని సంస్థాపరమైన కుల తత్వాన్ని లింగ వివక్షను కొనసాగిస్తూనే వుంటాడు.

నిజాయితీపరులు, అభ్యుదయ భావాలున్న వ్యక్తులు "అనుకోకుండానే" లింగ వివక్షను కొనసాగిస్తుంటారు. కనుకనే స్త్రీలు తమకు తాము ప్రత్యేకంగా, మగ వాళ్ళకు ప్రవేశం లేకుండా స్త్రీ ఉద్యమం నిర్మించే ప్రయత్నం చేయాలన్న అవస రాన్ని గుర్తించారు. పితృస్వామ్య స్వభావాన్ని స్త్రీల సమస్యలను అర్థం చేసుకుని విశ్లేషించాలంటే ఇది కనీసావసరం అని స్త్రీలకు అనుభవంలో అర్థమయింది. రక రకాల సానుభూతిపరులు గత వంద సంవత్సరాలుగా స్త్రీల సమస్య గురించి చర్చిస్తు న్నారు. కాని 1970ల వరకు ప్రపంచంలో ఎక్కడా స్త్రీల ఉద్యమాలకు స్త్రీలే నాయకత్వం వహించటం జరగలేదు. అప్పుడే ఉద్యమం పరిధి కూడా విస్తృతం అయింది. స్త్రీ సమస్యకు కొత్త నిర్వచనాన్నిచ్చే రాజకీయ చొరవల కోసం వ్యూహాలు నిర్మించటం ప్రారంభమయింది. కుటుంబం, వ్యక్తిగత సంబంధాలు, విజ్ఞాన వ్యవస్థలన్నింటిలోనూ 'అధికారం' అణచివేతలెలా నిర్వహించటం జరుగు తుందో వెలికి తెచ్చే కృషిమీద ఉద్యమం దృష్టి కేంద్రీకరించినది. ఉదాహరణలుగా కొన్ని విషయాల్ని ఇక్కడ క్లుప్తంగా పరిశీలించటం జరిగింది.

కుటుంబం :

సమాజాన్ని ప్రైవేటు పబ్లిక్ రంగాలుగా విభజించటం సంప్రదాయకంగా వస్తోంది. ఇది వ్యక్తి వైయక్తికతను రూపొందించటంలో ముఖ్యమైన క్రమాన్ని, పద్ధతుల్ని అంతుపట్టకుండా చేసేందుకు దోహదం చేస్తుంది. ఈ విషయాన్ని స్త్రీ వాదులు వెలుగులోకి తీసుకువచ్చారు. కుటుంబంలో చిన్నప్పటి నుంచీ కథలద్వారా, ఆటలద్వారా, రోజువారీ మాటల్లో, చర్చల్లో, 'పెళ్ళి' 'మాతృత్వం' వంటివి స్త్రీ జీవితంలో "సహజమైన" విషయాలుగా అమ్మాయిలు నేర్చుకుంటారు. అట్లానే

వంట చేయటం, పిల్లల సంరక్షణలో వాళ్ళదే ప్రధాన బాధ్యతని కూడా వాళ్ళ రక్తంలో జీర్ణించుకు పోతుంది. అందుకే మగవాళ్ళు ఈ పనులు చేస్తే తమకే తలవంపులనే ఆడవాళ్ళంటే ఆశ్చర్యపడనవసరం లేదు.

## విజ్ఞాన వ్యవస్థ :

సంప్రదాయిక పరిధిలో ఆర్థికశాస్త్రాన్ని అర్థం చేసుకోవటం వలన స్త్రీలు చేసే శ్రమకు అంచనా లేకుండా ఏ విధంగా మరుగు పడిపోయిందో స్త్రీ వాదుల కృషితోటే వెలుగులోకి వచ్చింది. మనదేశంలో ఫ్యాక్టరీలలోనే కాదు ఉత్పత్తి, ఇళ్ళల్లోనూ జరుగుతుంది. ఈ కార్యక్రమంలో ఒక్క వ్యక్తికాకుండా, కుటుంబం మొత్తం - అందులోనూ ముఖ్యంగా స్త్రీల శ్రమ ఎక్కువ పాలు వుంటుంది. ఆర్థిక శాస్త్రవేత్తల లెక్కల్లో కుమ్మరి ప్రధానంగా జీతం సంపాదించే కార్మికుడు కానీ అతని భార్య అతనితోపాటు పనిచేసి కుండలకు కావలసిన మట్టినందించినా ఆమెది ఉత్పత్తి కోసం చేసే శ్రమకింద లెక్కకాదు. పురుషుడు ప్రధానంగా శ్రమచేసే వాడయితే స్త్రీ దానికి తోడందించేదిగా మాత్రమే (Supplementary income) లెక్కవేయబడుతుంది. అంతేకాదు. ఇంటిలో చాకిరీతోటి ఆర్థిక కార్యక్రమం కలిపివేయబడి, స్త్రీల శ్రమ తీరిక సమయంలో చేసుకునే హాబీగా కనిపిస్తుంది. పురుషులు ప్రధానంగా సంపాదించేవాళ్ళయితే, స్త్రీల సంపాదన వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు తోడన్నట్లు అందరి భావన. దీన్ని స్త్రీవాదులు ప్రపంచమంతటా ప్రశ్నించారు.

## ఆరోగ్య వైద్య వ్యవస్థ :

స్త్రీల ఆరోగ్య సమస్యలకి అస్వస్థతలకి, సాంఘిక వ్యవస్థలో కారణాలు వెతకకుండా నిద్రమాత్రలతో పరిష్కరించటానికి చూసే వైద్య వ్యవస్థను, స్త్రీలపై అది చెలాయించే అధికారాన్ని స్త్రీల ఉద్యమం ప్రశ్నించింది. స్త్రీలను పిల్లల్ని కనే యంత్రాలుగా మాత్రమే గుర్తించే వ్యవస్థను ఉద్యమం సవాలు చేసింది. స్త్రీలను నిరంతరం వేధించే నడుంనొప్పి, రక్తహీనత, తెల్లబట్ట, విశ్రాంతి అనేమాటే లేకుండా చాకిరి చేయటంవంటి సమస్యలన్నింటినీ లెక్కచేయకుండా కుటుంబ నియంత్రణ నొక్కదానిని దేశానికి ప్రధాన సమస్యను చేసిన వైద్య వ్యవస్థను; బలవంతంగా కుటుంబ నియంత్రణ అమలు చేసే పద్ధతులను; "నెటె ఎన్" వంటి హానికర

పైన సాధనాల్ని (పిల్లలు పుట్టకుండా ఇచ్చే ఇంజక్షన్లు) ప్రవేశపెట్టటాన్ని; వైద్య వ్యవస్థకు అంతర్జాతీయ అనాథ సంస్థలకు, బహుళజాతి మందుల కంపెనీలకు కల సంబంధాలను వెుగ్గులోకి ఉద్యమం తీసుకువచ్చింది.

'సాహిత్యం' 'చరిత్ర' వంటి విషయాలలో స్త్రీల ఉద్యమం తీసుకున్న చొరవ, లేవనెత్తిన ప్రశ్నలు, నిర్వహించిన చర్చలతో తెలుగు పాఠకులు చిర పరిచితులే.

స్త్రీ ఉద్యమ చరిత్రను దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే బాలగోపాల్‌కు స్త్రీ వాదం పట్ల వున్న అవగాహనను చూసి ఆశ్చర్య పడాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. "స్త్రీ వ్యక్తిత్వం పైన ఆదివాసీ సమాజానికి ఉన్న పెత్తనం" ఎదిరించిన రాగో ఉద్యమం (కమ్యూనిస్ట్) లోకి వచ్చిందే కాని మరో కారణం లేదని బాలగోపాల్ భావన. వివరణను ఒక "వ్యక్తి" పరిధిలోనే ఇవ్వటం మూలంగా, స్త్రీ వాదాన్ని సంప్రదాయ అతివాద (Right wing) పద్ధతిలో అర్థం చేసుకోవటానికి మాత్రమే దారితీస్తుంది. సమస్య గురించి అసలు రాగో ఆలోచన అదే అయివుంటుందా అని అనుమానం రాకపోదు. (డి. హెచ్. లారెన్స్ సృష్టించిన లేడీ ఛాటర్లీ పాత్ర నిజానికి ఒక మగవాడిది అని ఒక పేరు పొందిన స్త్రీవాద విమర్శకురాలు చేసిన ఆసక్తికరమైన విమర్శ గుర్తుకొస్తుంది. అగ్రకుల పురుషుడి ఆలోచనల్నుంచి రాగో లాంటి గిరిజన స్త్రీ పాత్ర పుట్టి ఉంటుందనుకున్నా ఈ సందర్భంలో ఆశ్చర్యం లేదు.) ఒకసారి స్త్రీ వాదాన్ని 'వ్యక్తిత్వం' కోసం వెతుక్కునే స్త్రీల తిరుగుబాటుగా అర్థం చేసుకున్న తర్వాత, బాలగోపాల్ చెప్పినట్లుగా దాని లక్ష్యాలు పరిమితమైనవే కాకుండా, సోషలిజం అంతిమ లక్ష్యంతో పొత్తులేనిదిగా కనిపించటం కూడా సమంజసమే.

గత ఇరవై అయిదు సంవత్సరాలుగా రాజకీయ రంగ ప్రధాన సమస్యల స్వరూపంలో మౌలికమైన మార్పులు తీసుకురావటానికి దోహదం చేసిన స్త్రీ వాదానికి ఈనాటి దళిత ఉద్యమానికి సారూప్యం కనిపిస్తుంది. ఉదాహరణకు ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో బహుజన సమాజపార్టీ సాధించిన విజయానికి ఒక ప్రత్యేకత వుంది. దళిత ఉద్యమాలకు దళితులే నాయకత్వం వహిస్తున్న ఈ సందర్భంలో ముందు కొస్తున్న కుల సమస్యలు అణచివేయబడిన కులాలలో ఎన్నోరకాల వ్యక్తుల రాజకీయ అనుభవాలకు దగ్గరగా ఉంటాయనటంలో సందేహం లేదు. అందుకే

ఎక్కువ సంఖ్యలో, ఎన్నడూ లేనంతగా స్త్రీలను స్త్రీవాద ఉద్యమం ఆకర్షించి నట్టే ఈ ఉద్యమం కూడా దళితులను ఆకర్షిస్తుందనటం అతిశయోక్తి కాదు. స్త్రీల ఉద్యమంలో సమస్యల పరిధి విస్తృతమవటమే కాకుండా ఏది రాజకీయం అనే నిర్వచనం కూడా తిరిగి రూపొందించటం జరిగింది. స్త్రీల పోరాటాలకు బయటి పరిధి నుంచి వచ్చిన సంఘ సంస్కర్తలు కానీ అభ్యుదయ వాదులు కానీ నాయకత్వం వహించలేదు. కొత్త దళిత ఉద్యమ సమస్యలు, ఈ రోజు సిద్ధాంత వ్యవస్థల నుంచి రోజు వారీ రాజకీయాల వరకు ఎన్నో రకాల అంశాల్ని ప్రభావితం చేస్తున్నట్టు స్పష్టంగా కనిపిస్తుంది. దళితులు కుల సమస్యను విశ్లేషించే పద్ధతిలో "భారతీయ వేదాంతం". "భారతీయ సంస్కృతి" "భారతీయ సాహిత్యం" అనే పేరుతో చెలామణి అవుతున్న అగ్రకుల ఆధిపత్యం వివిధ రూపాలను సవాలు చేస్తున్నారు. 'విజ్ఞానం' ఏమిటి, అది ఏ విధంగా ఏర్పడుతుంది, దాన్నేర్పరచటానికి, నిర్వహించటానికి ఎవరెవర్ని బయట ఉంచటం అవసరం అనే అంశాలను; అధికార వ్యవస్థలను మరింత గట్టి పరిచే అంశాలను దళిత ఉద్యమం ప్రశ్నిస్తున్నది. అంతేకాదు, దళితుల రాజకీయ పోరాటాల్ని విలువలేనిదిగా దిగజార్చటానికి మధ్యతరగతి, అగ్రకులాలు 'వినయం', 'మంచి ప్రవర్తనలను' సాకు చేశాయి కాబట్టే ఆ లక్షణాలను కూడా దళితులు ధిక్కరిస్తున్నారు. స్త్రీవాదులను దెబ్బతీయటానికి కూడా చాలా సార్లు ఇదే 'వినయం', 'మంచి ప్రవర్తన'లను వాదనకు ప్రయోగించటం మన కనుభవమే. మన సమాజంలో "ఆదర్శస్త్రీ ఇబ్బందికరమైన ప్రశ్నలను అడగటం కానీ, రాజకీయ ఉద్యమాలలో హక్కుల కోసం పోరాటం కాని చేయకూడదు. అగ్రకులాల, వర్గాల పురుషులు, స్త్రీల దళితుల ఉద్యమాలకు నాయకత్వం కొనసాగించినంతకాలం ఆ పోరాటాల పరిమితుల్ని కూడా నిర్ణయిస్తూనే వుంటారు. ఆ పరిమితుల్ని మించి దళితులైనా, స్త్రీలయినా ప్రత్యేకంగా చొరవ తీసుకోవటం జరిగితే దాన్ని అవిధేయతగా అసంబద్ధమైనదిగా, అమర్యాదకర ప్రవర్తనగా ముద్రవేయటం జరుగుతుంది.

ఇక్కడి నుంచి ప్రశ్న రాంగోపాల్ వ్యాసంలో ప్రస్తావించిన "మనం" "వాళ్ళు" అన్న విషయానికి వెళ్లుతుంది రాగో వంటి గిరిజన స్త్రీలు దళితులు (స్త్రీలు/ పురుషులు) "వాళ్లు" అవుతారు. ఈ విధంగా "వాళ్ళు" మనం అని విభజించటం "వాళ్ళకు" "ఉద్యమం అంతిమ లక్ష్యాల పట్ల అవగాహన లేదని" చెప్పటాన్ని

సులభతరం చేస్తుంది. బాలగోపాల్ అభిప్రాయంలో అణచివేత పట్ల "వాళ్ళు" చూపే నిరసన చాలా "పరిమితమైనది". ఒకసారి వాళ్ళ తక్షణ అవసరాలు (ఉదా : జీతాలు పెరగటం) తీరితే, వాళ్ళ "మానవ స్వభావం" లోని వికృత లక్షణాలు "వాళ్ళను" డబ్బు శక్తి, కాంగ్రెస్ పార్టీ, సినిమాల మాయలో పడేట్టు చేస్తాయి. అయితే బాలగోపాల్ మాట్లాడుతున్న "మనం" ఎవరి గురించి ? మనమే ఆ "చైతన్య వంతులైన వ్యక్తులం." మనం కులం, వర్గం, లింగం- అన్నిటికీ అతీతులమైన దైవాంశ సంభూతులం. అలా అన్నిటికీ అతీతులం కాబట్టి మనకు "ఉద్యమం అంతిమ లక్ష్యాలేమిటో స్పష్టంగా తెలుస్తాయి. వాటి సాధన కోసం కృషి చేయగలుగుతాం."

కార్మిక వర్గం నాయకత్వంలో మాత్రమే సోషలిస్టు సమాజ స్థాపన జరుగుతుందనే ప్రాథమిక మార్క్సిస్టు సూత్రాన్ని మొదటిసారి విమర్శనాత్మకంగా పరిశీలించే ధైర్యం బాలగోపాల్ చేశారని చెప్పాలి. ఆయన రాసినట్టుగా సోషలిజం అంటే అణచివేత మూలంగా కలిగే సహజమైన కోరిక కాదు "అణచివేత అనుభవిస్తున్న వాళ్ళు సమానత్వం కోరుకున్నా, ఇతర్లు అందరికీ కూడా సమానత్వం ఉండాలని ఆశిస్తారనే నమ్మకం ఏమీ లేదు." అణచివేతకు గురయ్యే గ్రూపులు అందరూ "స్వభావరీత్యా" ఒకరి సమానత్వం కోసం మరొకరు పాకులాడుతారనే గ్యారంటీ లేదు. అందరూ ఏదో ఒకరకమైన అణచివేతకు గురవుతున్నారు. కనుక ఒకరిపై నొకరు అధికారం చెలాయించరని చెప్పలేం. దీన్నుంచి, మనుషులో, కార్మికులుగా, గిరిజనులుగా, స్త్రీలుగా, దళితులుగా సోషలిజంను ఆశిస్తారని చెప్పలేం, చెప్పకూడదు కూడా అంటూ తీర్మానిస్తాడు బాలగోపాల్. అణచివేతకు గురయ్యే గ్రూపులన్నీ ఒకరి పట్ల ఒకరు సహజంగానే సానుభూతి వ్యక్తం చేస్తారని వాదించటం మా అభిమతం కాదు. అలా చేయటం బాలగోపాల్‌కి చేసిన తప్పునే (తలక్రిందులుచేసినా) మళ్ళీ చేయటం అవుతుంది. అయినా, మా అభిప్రాయంలో సానుభూతి రాజకీయంగా సృష్టించుకోవాల్సిన విషయం. ఉదా : మధ్యతరగతి స్త్రీలకు, దళిత పురుషులకు తేడా వుంది. కానీ ఏ "చైతన్యవంతమైన వ్యక్తి కూడా ఈ తేడాలను విస్మరించలేదు. సోషలిజం స్థాపనకు స్త్రీల ఉద్యమం, దళిత ఉద్యమాల మధ్య రాజకీయంగా కొత్త కలిపి పునాది నేర్పరచాల్సి ఉంటుంది. కాని బాలగోపాల్ వాదనలో

"పీడిత ప్రజలు పీడకుల పైన పోరాటాలు చేస్తే సరిపోదు. ప్రతి ఒక్క వ్యక్తి తన మీద తాను చాలా పోరాటం చేయవల్సి ఉంటుంది." ప్రత్యేకమైన అణచివేత లను అధిగమించి "చైతన్యులయిన వ్యక్తులు కావటానికి మా భావనలో అణచి వేయ బడే ఇతర గ్రూపులతో అనుబంధం ఏర్పరచుకునే కృషి చేయాలి. ఈ పోరాటంలో మాత్రమే మనను మనం మార్చుకొనే ప్రయత్నం కూడా చేయగలుగుతాం. అంతే కాదు, మనకెన్ని రకాల అవకాశాలు, అధికారాలు ఉన్నాయో గుర్తించే ప్రయత్నం: వివక్షను అర్థం చేసుకునే ప్రయత్నం - ఇవన్నీ కూడా 'నీతి'కి సంబంధించిన (వ్యక్తిగతంగా నీతి నాచరించటం) విషయాలు కావని, రాజకీయానికి సంబంధించిన వేనని అర్థం చేసుకోగలుగుతాం. బాలగోపాల్ ప్రతిపాదించినట్టు వైయక్తికత అనేది ఒక "సహజ సిద్ధమైన" (సహజంగానే వికృతం కాగలిగే) అంశం కాదనీ, అది సాంఘిక చారిత్రక మార్పులకు లోనయ్యే ఒక రంగం అనీ మా అవగాహన. "చైతన్యులయిన వ్యక్తులు" అంటే కులంతో, లింగంతో ఎటువంటి సంబంధం లేని వాళ్ళనీ, ఇంకొక రకంగా చెప్పాలంటే అగ్రకుల వర్గ పురుషుల మాత్రమే ననే అర్థం స్ఫురించే పద్ధతిలో బాలగోపాల్ వాదించటం చూస్తే భయంకరమైన నిస్పృహకు లోను కావటం తప్ప మరో మార్గం వుండదు. దానికి విరుద్ధంగా, ప్రత్యేక సమస్య లపై పోరాటాలతో వచ్చిన నాయకత్వం (గ్రామ్‌సీ వివరించిన సజీవ మేధావులు), చరిత్ర మూలంగా ఏర్పడ్డ పరిస్థితులతో ముడిపడి వుండి రాజకీయ పోరాటాల్ని సమర్థతతో నిర్వహించగలుగుతారని మా వాదన. ఆ క్రమంలోనే సాంఘిక వ్యవ స్థలో అణచివేతల నిర్మాణాల్ని వెలికి తీసుకొచ్చి రాగలిగే శక్తిని కూడా సాధించ గలుగుతారు.

దళితులు, స్త్రీలు, గిరిజనులు చేసే పోరాటాల "బయటి" పరిధిలో "భౌతిక మైన, నిర్దిష్టమైన" విశ్లేషణ ఒకటుందని: ఈ విశ్లేషణతోనే సోషలిజం "అంతిమ లక్ష్యాల"కు మార్గం లభిస్తుందనే విషయం మేం అంగీకరించమని ఇప్పటికి స్పష్టమై వుంటుంది. బాలగోపాల్ చెప్పే అంతిమ లక్ష్యాలు "పరిమితమైన" పోరాటాల (దళితులు, స్త్రీలు, గిరిజనులు) లక్ష్యాలకు బాహ్యమైనవీ, అంతకంటే గొప్పవీ ఎలా అవుతాయి ? లెనినిస్ట్ పార్టీ సూత్రీకరించే ఆదర్శాలలోని అస్పష్ట అంతిమ లక్ష్యమే ప్రతివారికీ సమానత్వం కానక్కరలేదు. దాని బదులు, ఇప్పుడొస్తున్న పోరాటాల రంగాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే, రాజకీయాల నూతన

రూపాలకు అవకాశం ఏర్పడుతుంది. మార్క్సిస్టు-ఫెమినిస్టు షీలా రౌబోతమ్ చెప్పినట్టు లెనినిస్ట్ పార్టీ, రాజకీయ సిద్ధాంతాలు నిర్మాణాలన్నిటిలోకి ఉత్తమమైనవనీ, ఇతర రకాల సిద్ధాంతాలన్నీ పురాతనమైనవీ లేక తప్పుదారి పట్టించేవనే ఆలోచనను ఇప్పటికైనా వదులుకుంటే మంచిది. నూతన సోషలిస్ట్ రాజకీయాలలో "చైతన్యులైన వ్యక్తుల"ను ఉత్పత్తి చేయటానికి, ప్రత్యేక వైయక్తికతను, ఉనికినీ అణచివేసి, రూపం లేకుండా చేసే అవసరం లేదు. ఈ ప్రత్యేక వైయక్తికతలను రాజకీయం చేయటం ద్వారా కొత్త సంబంధాలకు మార్గాలు ఏర్పరచుకో గలుగుతాం. మన దేశంలో ఈ రోజు స్త్రీలు, దళితులు, మత తత్వాన్ని వ్యతిరేకించే శక్తులు, గిరిజనులు, రైతాంగం, కార్మికులు- చేసే పోరాటాల పరిధికి బయట మనం నిర్మించ గలిగే సోషలిస్ట్ రాజకీయాలంటూ ఏమీ ఉండవు. సోషలిజంను ఒక ఆదర్శమైన ఊహగా కాకుండా చారిత్రక సందర్భంగా అర్థం చేసుకోవాలంటే కొత్త గ్రూపుల మధ్య రాజకీయ అంగీకారాలు కుదుర్చుకునే అవసరాన్ని ఒప్పుకొని తీరక తప్పదు. లేకపోతే బాలగోపాల్ చెప్పిన "చైతన్యులయిన వ్యక్తులు" అగ్రకుల, అగ్రవర్ణ పురుషులుగానే చిరకాలం వర్ధిల్లుతారు.

కె. లలిత　　తేజస్విని నిరంజన　　సూసీతారు

ప్రతిస్పందన :

# ప్రజాస్వామిక ఉద్యమాలు - గతితర్కం

"ప్రైవేటు హింసను ఖండించకుండా దూరంగా ఉండడం వల్ల ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం దేశంలోని యితర ప్రజాస్వామిక సంస్థలలో అద్వితీయంగా నిలచింది. APCLC పొందుతున్న అత్యంత ప్రాముఖ్యతకు పైన పేర్కొన్న విషయం ఎంతగానో దోహదపడింది." 1991 ఏప్రిల్‌లో జరిగిన APCLC ఏడవ మహాసభలో ప్రారంభోపన్యాసం చేస్తూ రణధీర్‌సింగ్ పై మాటలన్నాడు. ఆయన ఒక హెచ్చరిక కూడా చేశాడు. అదేమిటంటే ప్రజాస్వామిక సంస్థలు కనుక రాజ్యం (State) యొక్క ఒత్తిడి మూలంగానో లేదా పత్రికల ఒత్తిడి మూలంగానో ప్రైవేటు హింస అనే అంశాన్ని తమ అజెండాలోకి తీసుకొని వస్తే, ఇక ఆ ప్రజాస్వామిక సంస్థలు నిస్సందేహంగా రాజ్యాన్ని సమర్థించేంతవరకు సంతృప్తి పడవు.

ఏడవ మహాసభ తర్వాత, గడచిన రెండేళ్ళకాలంలో APCLC తన ప్రాముఖ్యతను కోల్పోనప్పటికీ, తన ప్రత్యేకతను కోల్పోతున్నట్లనిపిస్తుంది. ప్రైవేటు హింస అనే అంశాన్ని తన అజెండాలోకి తీసుకొని రావడం వల్ల అది రాజ్యహింసను సమర్థించలేదు, అయితే దాని మూలంగా అది ఆంధ్రప్రదేశ్ లోని క్రూరులు, దుర్మార్గులైన పోలీసు ఆఫీసర్లలో ఒకడుగా పేరుపొందిన కె. యస్. వ్యాస్ హత్యను ఖండించేవరకు పోయింది. ['కొయ్యూరుపై కొన్ని ఆలోచనలు' EPW మార్చి 27. (యిది కన్నాబిరాన్ రాసిన వ్యాసం. తెలుగు అనువాదం అరుణతారలో వచ్చింది -అను]

ఈ ప్రతిస్పందన (కన్నాబిరాన్ వ్యాసానికి ఈ వ్యాసం ప్రతిస్పందన అని అర్థం- అను) మొదట కొయ్యూరు కిడ్నాపింగ్‌కు సంబంధించి ప్రత్యేకంగా చర్చిస్తుంది. రెండవదీ, మరింత ముఖ్యమైనదీ రాడికల్ మరియు ప్రజాస్వామిక ఉద్యమాలకూ, మానవ హక్కుల ఉద్యమాలకు ఎటువంటి సంబంధం వుండాలి అనే అంశాన్నీ, సంబంధిత యితర అంశాల్ని గూర్చి చర్చిస్తుంది.

# 1

పీపుల్స్‌వార్ గ్రూపు యే రామన్న, రణదేవ్‌ల విడుదల కోసం కిడ్నాప్ చేసిందో ఆ రామన్న, రణదేవ్‌లు ఉద్యమంలో తిరిగి చేరడానికి యిష్టపడడం లేదనీ, అందువల్ల కిడ్నాప్ చేసిన వ్యక్తులను విడచి పెట్టమని ప్రభుత్వమూ, APCLC ప్రకటనలు చేయడంతో మొత్తం కిడ్నాపు సంఘటన ఒక డ్రామాగా మారిపోయింది. యిప్పటికీ రామన్న అలాంటి ప్రకటన యివ్వకపోగా (అతనిచ్చినట్టుగా APCLC పొరబాటుగా నమ్మింది), వరంగల్ యస్పీ, అత్యంత అపఖ్యాతి గల డి. టి. నాయక్ చేత మాన సికంగా చిత్రహింసలకు గురయ్యాక 40-45 రోజుల తర్వాత రణదేవ్ అలాంటి ప్రకటన యిచ్చాడు. రణదేవ్‌ను ఆంధ్రప్రదేశ్ పోలీసులు కాకుండా, మహారాష్ట్ర పోలీసులు నాగపూర్‌లో అరెస్టు చేశారు కాబట్టే అతనింకా బతికున్నాడు. ఆంధ్ర ప్రదేశ్ పోలీసులు నాగపూర్ కోర్టుద్వారా రణదేవ్‌ను తమ కస్టడీలోకి తీసుకొన్నారు. రణదేవ్ ఉద్దేశాలను గూర్చి సరిగ్గా పరిశీలించకుండా ప్రకటన యివ్వడంలో APCLC తొందరపడింది.

ప్రభుత్వం అబద్దాలు చెప్పడం ప్రారంభించింది. దాని ప్రతినిధియైన ఆల్ ఇండియా రేడియో, హైద్రాబాద్ ఈ అబద్దాల్ని ప్రసారం చేసింది. పీపుల్స్ వార్ (PW) దళం APCLC ప్రకటనల్ని నమ్మకుండా రణదేవ్‌ను విడుదల చేయాలని పట్టు పట్టింది. APCLC జోక్యం చేసుకొన్నాక ఎవరైనా ఆధారపడ్డ తగ్గ వ్యక్తి చేత రణదేవ్ ఉద్దేశాల్ని కనుక్కోవాలని దళం కోరింది. ఆ వ్యక్తి కాళోజి. రణదేవ్‌ను కలుసుకొనేందుకు కాళోజీని పంపడానికి ప్రభుత్వం ఒప్పుకొన్నది. కాళోజీ కూడా సంసిద్ధత వ్యక్త పరిచాడు. అయితే వరంగల్ జిల్లా కలెక్టరు అప్పుడే తొందర పడాల్సింది లేదని, మరికొంతకాలం ఆగమని కాళోజీకి వర్తమానం పంపాడు. యిప్పుడే డ్రామా మరింత ముందుకొచ్చింది. ఫిబ్రవరి 8న 6.45 ఉదయం వార్తల్లో ఆకాశవాణి హైద్రాబాద్ వాళ్ళు ఆశ్చర్యకరమైన ప్రకటనను వెలువరించారు. తాను వ్యక్తిగత కారణాల రీత్యా ఉద్యమంలోకి రావడానికి యిష్టపడటం లేదని, అందువల్ల కిడ్నాప్ చేసిన వ్యక్తుల్ని విడిచి పెట్టమని కోరుతూ రణదేవ్ స్వరం రేడియోలో ప్రసారమయ్యింది.

ఈ సంఘటనతో కిడ్నాప్ చేసిన వ్యక్తులను PW విడచిపెట్టేస్తుందని దాదాపు అందరూ అనుకొన్నారు. తమ ఉద్యమంలో చేరడానికి యిష్టపడని వ్యక్తి విడుదల కోసం డిమాండు చేయడం ద్వారా PW తన మూర్ఖత్వాన్ని బయట పెట్టుకున్నదని ప్రతి ఒక్కరూ అనుకొన్నారు. అయితే PW తాము రణదేవ్‌తో నేరుగా మాట్లాడాలని లేదా నమ్మదగ్గ వ్యక్తి ద్వారా వినాలని పట్టుపట్టింది. ఒక రోజు తర్వాత అది రణదేవ్ గొంతు కాదని, అతని స్వరం మిమిక్రీ చేయబడిందని అందరికీ అర్థమైంది, నిజమైన గొంతును కాక, మిమిక్రీ చేయబడిన స్వరాన్ని తన వార్తా సమయంలో ప్రసారం చేయడం ఆకాశవాణి చరిత్రలో బహుశా యిదే మొదటి సారేమో. ప్రభుత్వ ప్రతిష్టకు భంగపాటు కల్గింది. దాంతో అది రణదేవ్‌ను కలుసుకొనేందుకు శాకోతిని అనుమతించాల్సి వచ్చింది.

PW లో చేరుతానని రణదేవ్ స్పష్టంగా వెల్లడించాడు. యిది ప్రభుత్వాన్ని సంకట స్థితిలో పడేసింది. అయినప్పటికీ ప్రభుత్వం తాత్సారం చేసింది. పరస్పర విరుద్ధ ప్రకటనలు వెలువడ్డాయి. ఈలోగా PW కిడ్నాప్ చేసిన నలుగుర్ని వదలి పెట్టేసింది. బాలరాజును, చిన్నంరాజును మాత్రం వదలిపెట్టలేదు. ప్రభుత్వం రణదేవ్‌ను వరంగల్ జైలునుంచి విశాఖ జైలుకు మార్చి, తమ డిమాండు పరిష్కారమయ్యిందని కనుక - జైళ్ళు మార్చడమే PW డిమాండు అయినట్టు ! కిడ్నాప్‌కు గురయిన వ్యక్తుల్ని విడచి పెట్టమని కోరింది. PW కొద్ది రోజుల తర్వాత బాలరాజునూ, చిన్నంరాజునూ కూడా విడచి పెట్టేసింది. రణదేవ్‌ను విడుదల చేయించుకోవడంలో PW విఫలమయినప్పటికీ, అది ప్రభుత్వాన్ని ఎండగట్టడంలో సఫలమైంది. ప్రభుత్వం గతంలో జరిగిన IAS ఆఫీసర్లు, సుధీర్‌కుమార్ కిడ్నాపుల సమయంలో వ్యవహరించిన తీరుకు, ప్రస్తుత కిడ్నాపు సమయంలో వ్యవహరించిన తీరుకు గల తేడాను బహిరంగపరచడంలో అది సఫలమైంది.

రాజకీయ పరిశీలకులు భావిస్తున్న ప్రకారం ప్రభుత్వం ఆడిన 'వాయిస్ డ్రామా' (రేడియోలో రణదేవ్ మిమిక్రీ స్వరం రావడం-అను) మూలంగా రణదేవ్‌ను విడుదల చేసే స్థితికి అది నెట్టబడింది. ఎందుకంటే అది యిప్పటి వరకు రణదేవ్ 'అయిష్టత' అనే సాకు చూపిస్తున్నది. బాలరాజును విడుదల చేయించడంలో ప్రభుత్వం చూపిన వివశతను గూర్చి PW లేవదీసిన చర్చకూడా మరొక అంశం.

APCLC రెండు కిడ్నాప్ సంఘటనల్లో జోక్యం చేసుకొన్నది. మొదటి సంఘటనలో IAS ఆఫీసర్లు చిక్కుకోగా, రెండోసారి ఒక ఎమ్మెల్యే చిక్కుకొన్నాడు. ఈ రెండింటి మధ్య వివిధ రకాల కిడ్నాపులు ఒక వంద జరిగాయి. ఈ కేసుల్లో APCLC జోక్యం చేసుకోలేదు. వాళ్ళ విడుదల కోసం విజ్ఞప్తులు మాత్రం చేసి వూరుకొన్నది. ప్రభుత్వం కూడా APCLC దగ్గరికి పోలేదు. కొన్ని సమయాల్లో తమ డిమాండ్లు తీరకుండానే కిడ్నాప్ చేసిన వాళ్ళను PW విడచి పెట్టింది. కొన్ని సమయాల్లో ప్రభుత్వం వాళ్ళ డిమాండ్లకు తలొగ్గింది. సుధీర్ కుమార్ విషయంలో నక్సలైట్లను విమానంలో తెచ్చి వదలడం ద్వారా అతన్ని విడిపించుకొంది. యిదంతా చెబుతున్నదేమిటి ? ప్రభుత్వం ఎప్పుడు కూడా రాజకీయ ఒత్తిడుల కనుగుణంగానే-అది గుర్తేడు సంఘటనలోగానీ, యిప్పుడుగానీ-ప్రవర్తిస్తున్నది. APCLC జోక్యం చేసుకొన్నా, చేసుకోకపోయినా, ఫలితం ఒకే రకంగా ఉండేది. ప్రస్తుత కేసులో కూడా ప్రభుత్వ ప్రతిష్ఠకు, విశ్వసనీయతకు భంగం వాటిల్లకుండా వుండి వుంటే, రణదేవ్‌ను విడుదల చేసి వుండదం అనుమానమే. అంతేకాకుండా కొన్నిసార్లు కిడ్నాపుకు గురయిన వాళ్ళను విడిపించాలని, సంఘటనను సుఖాంతం చేయాలనే ఆతృతలో APCLC ప్రభుత్వం తరఫున మాట్లాడుతున్నట్టనిపిస్తుంది. APCLC PW మీద ఒత్తిడి తీసుకొచ్చిన విధంగా ప్రభుత్వం పై ఒత్తిడి తీసుకురాలేక పోయిందన్నదీ స్పష్టమే. పౌరహక్కుల సంఘాలు పనిచేసే క్రమంలో నూతన వైరుధ్యాలు పుట్టడానికిది దారితీస్తుంది.

జోక్యం చేసుకోవడం ఒక అంశం కాగా, ఒక గిరిజన నాయకుడు, ఒక మంచి నాయకుడు చిక్కుకొన్నందువల్ల తాను జోక్యం చేసుకోవాల్సి వచ్చిందని APCLC మరో వివాదాస్పద అంశాన్ని లేవనెత్తింది. బాలరాజు ఒక గిరిజనుడు. మంచిది. అయితే అతడొక MLA. ప్రశ్న ఏమిటంటే-ప్రజలమీద కొనసాగుతున్న నిర్బంధానికి MLA బాధ్యుడు కాదా ? అదికూడా పాలక పక్ష ఎమ్మెల్యే ? అతన్నొక మంచి, ప్రజాదరణగల వ్యక్తిగా తయారుచేస్తున్నారు. ప్రజాదరణ ! బహుశా నిజమే కావచ్చు. ఎందుకంటే ఈ రోజుల్లో MLAలు ఐదేండ్ల కాలంలో తమ నియోజక వర్గంలో రెండు మూడు సార్లకన్నా ఎక్కువ కన్పించడం అరుదు. యిప్పుడిప్పుడే పైకివస్తున్న MLA, రాజకీయ ఆకాంక్షలతో ప్రజలను కలుసుకోవడం, అది కూడా అడవుల్లో కాలినడకన తిరగడంతో అతను ఖచ్చితంగా ప్రజాదరణ గల నాయకు

తవుతాడు. ఎవరైనా నిరుద్యోగ యువకులకు కొన్ని ఉద్యోగాలిప్పిస్తే, ఒకటి రెండు స్కూలు భవనాలు నిర్మించడం, బోర్లు వేయించడం లాంటి పనులు చేస్తే, ఈ రోజున్న రాజకీయాల్లో వాళ్ళకు తప్పకుండా ప్రజాదరణ లభిస్తుంది. ఎందుకంటే యివన్నీ ప్రజా ప్రతినిధుల విధులని అందరూ మర్చిపోయారు. కానీ యింతేనా? ఏజెన్సీ ప్రాంతంలోని లేదా కొయ్యూరులోని గిరిజన గ్రామాలమీద ప్రభుత్వ నిర్బంధాన్ని గూర్చి ఏమంటారు? దానికంతటికీ పోలీసులు కారణమని చెబితే, దాన్ని MLA అసెంబ్లీలో ప్రశ్నించాల్సిన పని లేదా? అతడలా చేశాడన్నదానికి సాక్ష్యమేదైనా ఉందా? MLAలు, కలెక్టర్లు, యితర IAS ఆఫీసర్లు నిర్బంధానికి బాధ్యులు కాకపోతే మరెవరు బాధ్యులు? రాజ్యం అటువంటి అమూర్త (abstract) విషయమైతే, దోపిడీదారులందరూ కూడా అటువంటి వ్యవస్థలో భాగమే కాబట్టి ప్రజల్ని అటువంటి అమూర్త విషయానికి వ్యతిరేకంగా పోరాడమని వదిలేయాల్సి వస్తుంది. ఈ కారణంగానే బాలరాజు లాంటి 'మంచి' ఎమ్మెల్యేలు కూడా నిర్బంధానికి ప్రత్యక్షంగా బాధ్యులు కాకపోయినా, ప్రజా ప్రతినిధులుగా వాళ్ళను జవాబుదారులుగా చెయ్యాలి.

## 2

"కిడ్నాపింగ్ ఒక పోరాటరూపంగా ఉండకూడదు" అన్నపుడు చర్చ మరొక రకంగా ఉంటుంది. పై ప్రకటనతో APCLC యిప్పటివరకూ జాగ్రత్తగా దూరంగా ఉంచిన క్షేత్రంలోకి ప్రవేశించింది. APCLC కిడ్నాపింగ్ ఒక పోరాట రూపమా కాదా అనే చర్చలోకి కనుక ప్రవేశిస్తే, తర్కం మరింత కొనసాగి, అది వివిధ విప్లవ సంస్థలు చేపడుతున్న పోరాటరూపాలపై తీర్పు యివ్వాల్సి వస్తుంది. ఉదాహరణకు "వర్గశత్రు నిర్మూలన" అనేది ఒక పోరాటరూపంగా ఉండొచ్చా, ఉండకూడదా చెప్పమని ఎవరైనా ఒత్తిడి చేయొచ్చు. ఆ రూపం అప్రజాస్వామికమా కాదా? బస్సుల దగ్ధం ప్రజలకు, ముఖ్యంగా గ్రామీణ ప్రాంత ప్రజలకు చాలా అసౌకర్యం కల్గిస్తుంది కాబట్టి అది అప్రజాస్వామిక చర్యే కదా? పౌరహక్కుల సంఘాలకు హద్దు ఎక్కడ? పై ప్రశ్నలన్నీ కూడా వట్టి వూహలు కావు. అవన్నీ ఆంధ్రప్రదేశ్‌లోని విప్లవ వర్గాల మధ్య చర్చ జరుగుతున్న విషయాలే. అవన్నీ

కూడా పౌరహక్కుల సంఘాల చర్చల్లోకి వచ్చే అవకాశముంది. యిక్కడ పొంచి వున్న ప్రమాదమేమిటంటే వాళ్ళు రాడికల్ మరియు ప్రజాస్వామిక ఉద్యమాలు, అలాంటి యితర ఉద్యమాలతో (హింసాత్మక రూపాలు తీసుకొనే ఉద్యమాలతో) ఘర్షణ (confrontation) పడాల్సి వచ్చి, అంతిమంగా అది రాజ్యహింస బలపడేందుకూ, దానికి న్యాయబద్ధత కల్పించేందుకూ తోడ్పడుతుంది. అంతే కాకుండా అలాంటి పోరాటరూపాలకు సంబంధించిన చర్చకు అంతముండదు. అందరికీ ఆమోదయోగ్యమయిన రూపాలు, చట్టం, అంటే బూర్జువా చట్టం (లేదా అర్ధవలస, అర్ధభూస్వామ్య చట్టమా ?) అనుమతించిన రూపాలుగానే వుంటాయి. అలాంటపుడు ప్రజలకు హింసాత్మక రూపాలతో సహా ఎటువంటి రూపాలనయినా ఎంచుకొనే హక్కు ఉన్నదని భావించే పౌరహక్కుల కార్యకర్తలు-పౌరహక్కుల సంస్థల్లో వీళ్ళే అత్యధికులు-అలాంటి గ్రూపుల్లో వుండలేరు. పౌరహక్కుల సంస్థలు కనుక అలాంటి చర్చలోకి వెళితే అది ఆ సంస్థల్లో సంక్షోభం రావడానికి దారి తీస్తుంది.

మరొక వివాదాస్పదమైన విషయమేమిటంటే, "ఒక కిడ్నాపర్కూ, పోలీసులు చేసే అక్రమ నిర్బంధానికి మధ్య మేం తేడా చూడటంలేదు" అన్న ప్రకటన. యిక్కడ నేను ఆచరణకు సంబంధించిన ముఖ్యమైన అంశాలను లేవనెత్తే ప్రయత్నం చేస్తున్నాను. సైద్ధాంతిక అంశాలను, అవి మార్క్సిస్టులైనా, మార్క్సిస్టేతరమైనా, అవి ప్రజాస్వామికమైనవయినా, అప్రజాస్వామికమైనవయినా, వాటిని నాకన్నా సమర్థులకు వదిలేస్తాను.

ప్రస్తుతం సుమారు 10,000 మంది వ్యవసాయకూలీలు, రైతులు / కార్మికులు మరియు విప్లవ కార్యకర్తలు టాడా క్రింద విచారణకు నోచుకోక ఆంధ్రప్రదేశ్ జైళ్ళల్లో మ్రగ్గుతున్నారు. ఈ సంఖ్య రోజు రోజుకూ పెరుగుతున్నది. ప్రతి ఒక్కడి పైనా రెండు నుంచి పది నేరారోపణలుంటాయి. అన్నీకూడా టాడా క్రిందనే వుంటాయి. బెయిల్ పిటిషన్లు అనేకమార్లు తిరస్కరింపబడటమూ, పిటిషనర్లకు అప్పిలేట్ కోర్టులు చాలా దూరంలో వుండడం మూలంగా అనేక మంది విచారణ లేకుండా సంవత్సరాలుపాటు ఖైదీలుగా పడివుంటున్నారు. తెలంగాణా జిల్లాలలో తమ కేసు చూసేందుకు ఒక లాయర్ని పట్టుకోవడం చాలా కష్టం. ధైర్యంగా వీళ్ళ కేసుల్ని తీసుకొన్నందువల్లే నర్రా ప్రభాకర రెడ్డిని పోలీసులు చంపేశారు.

అయినప్పటికీ సానుభూతి పరులు, క్రిందిస్థాయి కార్యకర్తలు దబ్బుకోసం వచ్చే ఏదో ఒక లాయర్ని పట్టుకొని, రెండు మూడేండ్ల పాటు బెయిల్లు తిరస్కరింపబడటం లాంటి రొటీన్ లీగల్ విషయాలను దాటుకొని రాగలుగుతారను కొందాం. అయితే యిది అరెస్టయిన నాయకుల విషయంలో అసాధ్యం. (ప్రజాస్వామిక నిరసనల ద్వారా బయటకొచ్చేందుకు అందరూ నెల్సన్ మండేలాలు కాదు). అలాంటపుడు నిర్బంధంలో వున్న వారిని బయటకు తీసుకొచ్చేందుకు ప్రజాస్వామిక నిరసనల ద్వారా APCLC ఏమైనా చేయగల్గుతుందా? వూహూం! వీలుకాదు. యిక్కడ నేను APCLCని తప్పుపట్టడం లేదు. APCLC, ఆమాటకొస్తే అలాంటి యే సంస్థ అయినా, దాని పరిమితుల్ని గుర్తించడం మాత్రమే చేస్తున్నాను. అలాంటపుడు వీళ్ళ విడుదల కోసం విప్లవోద్యమం లేదా పార్టీ ఏం చేయాలి? ఎవరైనా ప్రత్యామ్నాయం చూపించగలిగితే కిడ్నాప్‌లను ప్రశ్నించవచ్చు. అలా చూపించనంతవరకు కిడ్నాపులను, అక్రమ నిర్బంధాలను సమానం చేయడం అంటే అది పూర్తిగా అప్రజాస్వామికం అని చెప్పాల్సి వస్తుంది.

ఈ రెండింటికి మధ్య తేడా చూడడంలో విఫలమయితే అది కిడ్నాపునూ, అక్రమ నిర్బంధాన్ని సమానం చేయడంలో మాత్రమే ఆగకుండా కొనసాగి కె. యస్. వ్యాస్‌లాంటి దుర్మార్గుడైన పోలీసు ఆఫీసర్ల హత్యను ఖండించడం వరకు పోతుంది. 1983లో ఖాజీపేట యస్. ఐ. యాదగిరి రెడ్డిని PW చంపినప్పుడు ప్రతిహింసలో జోక్యం చేసుకోవడం మాపనికాదని APCLC ఖచ్చితంగా చెప్పింది. కానీ యిప్పుడు వ్యాస్‌ను "అందరికీ బాగా తెలిసిన పోలీసు ఆఫీసరు" అని వర్ణించారు. "యిటువంటి హింసాత్మక చర్యను ఎవరూ హర్షించరు" అని ప్రకటించారు. ప్రశ్న ఏమిటంటే వ్యాస్ నల్గొండ యస్పీగా వున్నపుడు వ్యక్తిగతంగా బాధ్యుడైన ఎన్‌కౌంటర్లలో చనిపోయినవాళ్ళ 17 కుటుంబాలవారు ఈ 'ఎవరూ' లోకి వస్తారా? వ్యాస్ "గ్రేహౌండ్స్" కు చీఫ్‌గా వున్న కాలంలో తమ స్త్రీలను పురుషుల్ని కోల్పోయి, యిండ్లు కూలగొట్టబడి, పోలీసుల తుపాకుల బట్‌లచేతా, లాఠీలచేతా శరీరాలు నలగ్గొట్టబడి, ధాన్యం, బట్టలు బావుల్లో పారవేయబడిన వేలాది కుటుంబాలు కూడా ఈ 'ఎవరూ' లోకి వస్తారా? వ్యాస్ యాంటి నక్సల్ స్క్వాడ్ చీఫ్‌గా వున్నకాలంలో లాటిన్ అమెరికన్ పద్ధతిలో మాయం చేయబడిన 40 మంది విప్లవకారుల కుటుంబాలు కూడా ఈ 'ఎవరూ' క్రిందికి వస్తారా? వ్యాస్ దుష్టత్వాన్ని

గూర్చి Economic and Political Weekly లో బాలగోపాల్ విశదంగా వివరించాడు. రాజ్య హింసను ఎండగట్టడమే (expose) పౌరహక్కుల సంఘాల ప్రధాన కార్యక్రమంగా వుంటున్నప్పటికీ, APCLC ప్రస్తుత వైఖరి కనుక కొనసాగితే అది రెండువైపులా జరుగుతున్న హింసను సమానం చేయడానికి నెట్టబడుతుంది. ప్రతిహింసను ఖండించడం వల్ల పోరాడుతున్న ప్రజలు పౌర హక్కుల సంఘాలకు దూరమవుతారు. యిది ప్రజాస్వామిక ఉద్యమాలు బల పడేందుకు తోడ్పడుతుందా ?

పౌరహక్కుల సంస్థలు ప్రభుత్వం తమపై వేసిన రాడికల్ ఉద్యమ ప్రతినిధులు అనే ముద్రను తొలగించుకోవాలనే ప్రయత్నంలో, 'పరిణామాత్మక పాత్ర' (transforming role) ను నిర్వహించాలనే ఆతృతలో, 'మానవహక్కుల కార్యక్రమ రంగాన్ని విస్తృతం చేయాలి' అంటూ స్వతంత్ర పాత్రను నిర్వహించా లని చూస్తున్నాయి. అవి కేవలం రాడికల్ పార్టీల నుంచే కాకుండా ఉద్యమాల నుంచే స్వతంత్రంగా వుంటున్నాయి. ఫలితంగా పౌరహక్కుల సంస్థలకూ, రాడికల్ ఉద్యమాలకూ మధ్య వైరుధ్యాలు తలెత్తుతున్నాయి. ఈ క్రమంలో వాళ్ళు కాలం, స్థలాలకు సంబంధం లేకుండా 'రాజ్యం' అనే పదానికి ఒక అమూర్త (abstract) భావాన్ని యిస్తున్నారు. విషయాన్ని గతితార్కికంగా అర్థంచేసుకొనే పద్ధతి యిదీ కాదని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని రాడికల్ పార్టీల, ప్రజల 'చర్యలు' ఆ ఉద్యమ సానుభూతిపరుల్లో, పౌరహక్కుల కార్యకర్తల్లో సందేహాలకు తావిచ్చేవిధంగా వుంటున్నాయి. అవి అరాచకంగానూ, "రాజ్యం యొక్క పాశవికత్వాన్ని పున రుత్పత్తి" చేస్తున్నాయనీ అన్పిస్తున్నాయి. కాలం, స్థలం సంబంధాలలో వాటిని గుర్తించే ప్రయత్నం చేస్తాను. ఈ చర్యల్లో ముఖ్యమైనది 1990-91 లో అత్యధి కంగా జరిగిన ప్రజాకోర్టుల్లో జరిగిన 'అత్యాచారాలు' (excesses), వరంగల్, కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల్లో జరిగిన పట్టాభూములు ఆక్రమణలు, ఆదేకాలంలో విచక్షణారహితంగా జరిగిన 100 150 కిడ్నాపులు. ట్రెయిన్లను పట్టాలు తప్పించ డం, కాకతీయ ఎక్స్‌ప్రెస్‌ను తగులబెట్టడం, ప్రైవేటు జీపును పేల్చి వేయడం లాంటి యితరచర్యలకు PW క్షమాపణ చెప్తూ అందులో కొన్ని ప్రమాదవశాత్తూ

జరిగినవని చెప్పడం వల్ల వాటిని ఎక్కడా చర్చించడం లేదు. ప్రజలు కూడా వాటిని ప్రమాదవశాత్తూ జరిగిన చర్యలు గానే అర్థం చేసుకొన్నారు.

1970 లలో 1980 లలో ఆర్గనైజర్లు గ్రామాలకు వెళ్ళి 'దున్నేవాడిదే భూమి' అన్న నినాద సారాంశాన్ని వివరించేందుకు ప్రయత్నిస్తూ, భూస్వాముల పట్టాభూముల్ని దున్నేందుకు ముందుకు రావాల్సిందిగా భూమిలేని కూలీల్ని కోరినపుడు, వాళ్ళలోని భూస్వామ్య భావజాలం మూలంగా భూస్వాముల భూములు కూడా 'తమ' భూములేనని గుర్తించలేక పోయారు. "అన్నా అది దొర స్వంత భూమి కదా? దాన్ని ఆక్రమించడం పాపం. మేమేదైనా 'సర్కారీ' భూమికోసమో, అడవి భూమి కోసమో వెతుకుతాం" అని చెప్పేవారు. ఇరవయ్యేళ్ళ వర్గపోరాటం వాళ్ళ చైతన్యాన్ని పెంచింది. దున్నేవాడికే భూమిమీద హక్కువుందని వాళ్ళు గుర్తించగలిగారు. అందువల్ల 1990 మేలో వరంగల్‌లో జరిగిన రైతు కూలీ సంఘం రెండవ మహాసభల తర్వాత పార్టీ వర్గాల్లో ఆశ్చర్యం కల్గే విధంగా, పార్టీ పిలుపివ్వకుండానే ఎక్కడ చూచినా భూ ఆక్రమణలు మొదలయ్యాయి. పార్టీ మొట్టమొదటిసారిగా ఆచరణలో ప్రజల బ్రహ్మాండమైన శక్తి ఏమిటో చూచింది. ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం పైన క్రూరమైన నిర్బంధం రావడానికి, అది ఈనాటికీ కొనసాగడానికి యిది అత్యంత ప్రధానమైన కారణం. ఏది ఏమైనా 20 యేళ్ళ ఉద్యమం దేనికోసమైతే ప్రయత్నిస్తూ వుండిందో- దున్నేవానిదే భూమి అనీ, అది పోరాటం ద్వారా మాత్రమే సాధ్యమని ప్రజలు అర్థం చేసుకొనేలా చేయడం — అది సాధించబడింది. అదే విధంగా ప్రజాకోర్టుల్లోకూడా ప్రజలు తమ శక్తేమిటో గుర్తించారు. తుపాకి గొట్టంనుంచి వస్తుందని విప్లవకారులు చెబుతున్న 'రాజ్యాధికారపు' బీజాలు ప్రజల్లో చల్లబడినాయి. అది ఎంత తక్కువ కాలమైనప్పటికీ ప్రజలు దాన్ని చవిచూశారు.

తమ బ్రహ్మాండమయిన శక్తిని ప్రజలు గుర్తించాక, వాళ్ళు తమ ఆజ్ఞ జారీ కావాలనికూడా కోరుకొన్నారు. అందువల్ల గ్రామసంఘనాయకులు అరెస్టయినపుడల్లా వాళ్ళు అన్ని రకాలుగా నిరసనలు తెలిపారు. తమ కామ్రేడ్ల విడుదల కోసం వాళ్ళు ధర్నాలను, పికెటింగులను, ప్రదర్శనలను నిర్వహించారు. ప్రభుత్వోద్యోగులను, బ్యాంకు ఉద్యోగులను, మండల రెవెన్యూ అధికారులను, మండల ప్రజా పంచాయితీ అధ్యక్షులను కిడ్నాప్ చేశారు. కొన్నిసార్లు యిది అటెండర్ల లాంటి కింది స్థాయి వుద్యోగులను కిడ్నాప్ చేసే స్థాయికి వెళ్ళింది. అతి కొద్ది సంఘటనల్లో

మాత్రమే వాళ్ళు ఉన్నతాధికార్లను తీసుకెళ్ళారు. వాళ్ళ నాయకులను ఒకటి రెండు రోజుల్లో విడుదల చేయించుకొన్నారు. ఈ క్రిందిస్థాయి ఉద్యోగుల్ని కిడ్నాప్ చేయడం మధ్యతరగతి సానుభూతిపరుల్లో కలవరానికి దారితీసింది. "రాజకీయాల్ని తుపాకి నియంత్రిస్తున్నది", "పార్టీ తమ కార్యకర్తలపై కంట్రోలును కోల్పోయింది" లాంటి మాటల్ని అనడం మొదలు పెట్టారు. అయితే ఈ 'అరాచకత్వాన్ని' అర్థం చేసుకొనే పద్ధతి ఏమిటి ? ప్రజలు అధికారాన్ని గుర్తించడాన్ని 1985 నుండి 1990 వరకు వాళ్ళు అనుభవించిన తీవ్రనిర్బంధం నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. ఆ కాలాన్ని వాళ్ళు 'పోలీసు రాజ్యం'గా అర్థం చేసుకొన్నారు. యిప్పుడు 'తమ రాజ్యం'. యిన్ని రోజులు ఈ సర్కారు వాళ్ళను వేధించింది. యిప్పుడు సర్కారును వేధించడం లేదా తమను వేధించకుండా దాన్ని ఆపడం వాళ్ళ వంతు. యిది 'అరాచకత్వపు' బీజమా ? లేక 'కార్మికవర్గ నియంతృత్వ' బీజమా ? దాన్ని కార్మికవర్గ నియంతృత్వ మనడం సహజంగా ఉండకపోవచ్చేమో కానీ అది ఖచ్చితంగా ఆ దశలో కొనసాగుతున్నదే. ఇరవై అయిదేళ్ళ పోరాటం మూడు విషయాలను ప్రజల చైతన్యంలోకి తీసుకొని రావడంలో సఫలమైంది. అవి : దున్నేవానికే భూమిపై హక్కు, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం, ఈ ప్రభుత్వం 'వాళ్ళ' ప్రభుత్వం కాదనే అవగాహన.

ఆటెండర్లను, విద్యుత్ బోర్డులో పనిచేసే లైన్‌మ్యాన్లను, అలాంటి యితర క్రింది స్థాయి ఉద్యోగస్తుల్ని కిడ్నాప్ చేయడంలో పైన పేర్కొన్న మూడు విషయాల్లో చివరిదానికి చాలా ప్రాధాన్యత వుంది. వీళ్ళంతా 'విప్లవానికి మిత్రులు' అనేది నిజమే. కానీ ప్రజలకు మాత్రం వీళ్ళంతా ఈ వ్యవస్థలో ఒక భాగం. ప్రత్యేకించి అలా ఎందుకంటే వీళ్ళల్లో అనేకులు లంచగొండులు. అందువల్ల కిడ్నాప్ చేయబడేందుకు అర్హులు. యిక్కడ గుర్తుంచు కోవలసింది దాదాపు ఈ అన్ని కిడ్నాపులనూ చేసింది మిలిటెంట్లు అంటే ప్రజాసంఘాలలోని గ్రామీణ యువకులు. అంతేకాకుండా ఒక్క సంఘటనలో కూడా ఎవర్నీ చంపలేదు. వాళ్ళు ఎలాగో నిజమైన శత్రువులకూ, ఈ వ్యవస్థకు చెందిన ఈ ప్రజలకు తేడా చూడ గలిగారు. అయితే ఆ తేడా అంత స్పష్టంగా లేదు. సరిగ్గా యిక్కడే విప్లవకర నాయకత్వం ప్రజల మధ్య వైరుధ్యాలను అర్థంచేసుకొని, వాటిని పరిష్కరించడంలో, తమ విప్లవాన్ని విజయవంతం చేసేందుకు ఐక్యసంఘటన అవసరం గూర్చి ప్రజలను గైడ్ చేయాల్సివుంది. వాళ్ళు కనుక ఈ రెండు విషయాలను అర్థం

చేసుకొంటే, ప్రజాకోర్టుల్లో జరిగే తప్పులు, కొన్ని సందర్భాల్లో మధ్యతరగతి రైతుల పట్టాభూముల్ని సైతం ఆక్రమించడం, ప్రజల మధ్య వైరుధ్యాలను పరిష్కరించడంలో యితర తప్పుడు పద్ధతులన్నీ వాటంతటికవే చక్కబడుతాయి. అయితే దానికి కొంత సమయం పట్టదా ? వాళ్ళ చైతన్యం యిప్పుడున్న స్థాయికి రావడానికి 25 ఏళ్ళు పడితే, పైన చెప్పిన విషయాలను అర్థం చేసుకోవడానికి అందులో సగం కాలమన్నా పట్టదా ? ఈరోగా పౌరహక్కుల సంస్థలు ఉద్యమంలో జరిగే తప్పుల్ని ఎత్తి చూపాలనుకొంటే, పోరాడుతున్న ప్రజల ప్రజాస్వామిక చైతన్యం మరింత పెరిగేందుకు దోహదపడేట్లు ఉండాలి తప్ప, పౌరహక్కుల ఉద్యమం, సంస్థలు స్వతంత్రమయినవి అనే అవగాహనతో ఉండకూడదు. ఎందుకంటే స్వతంత్రమైనవనే అవగాహన గతితార్కిక అవగాహనను విడచిపెడుతుంది. సూచించే ధోరణి కాక ఖండించే ధోరణి పెరుగుతుంది. గ్రామస్థాయి వైరుధ్యాల పరిష్కారానికి నాయకత్వమే కనుక పూనుకొంటే తప్పుల్ని చాలా వరకు తగ్గించవచ్చు. అలాకాక చొరవను ప్రజలకు కనుక వదిలివేస్తే, భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో అరాచకత్వం వచ్చేందుకు అవకాశముంది. అయితే వాళ్ళ అనుభవం వాళ్ళ చైతన్యస్థాయి పెరిగేందుకు దోహదపడుతుంద మొదటిది పూర్తిగా ఆచరణకు వీలుకానిది. ఒకవేళ ఆచరణకు వీలయినా, ఏగి అనుసరణ నీయమైంది ? గాంధీ చౌరా చౌరి సంఘటనలో చేసినట్టుగా, తప్పులు జరిగే అవకాశమున్నపుడల్లా, వెనక నుంచి పగ్గాలు పట్టుకు లాగడమా ? లేక చొరవను ప్రజలకు విడచిపెట్టి వాళ్ళను వాళ్ళు సరిదిద్దుకోవడంలో సహాయపడటమా ? ఏది సరియైన ప్రజాపంథా ? ఏది 'అధికార కేంద్రీకరణ' ? ఏది "భవిష్యత్తులో సమసమాజాన్ని గ్యారంటీ" యిస్తుంది ? ప్రజల చేతుల్లోని చొరవా ? లేక నాయకత్వంపై నుంచి యిచ్చే ఆజ్ఞలా ? సోవియట్ యూనియన్లో, యితర తూర్పు యూరపు దేశాల్లో మానవ హక్కుల ఉల్లంఘన మీద వచ్చిన విమర్శల్లో ముఖ్యమైంది ప్రజల చేతుల్లో చొరవ వున్నదనా లేక ప్రజల్ని వెనక్కిలాగుతూ కేంద్రంనుంచి డైరెక్షన్లు పంపినారనా ?

యిందులో కనుక సరియైన నిర్ణయం తీసుకోగల్గితే, పౌరహక్కుల కార్యకర్తలకు తాము ఏ "పరిణామాత్మక పాత్ర" ను నిర్వహించాలో, "రాడికల్ ఉద్యమాలతో తమకు ఎటువంటి సంబంధం" వుండాలో అర్థమవుతుంది.

[Economic and Political Weekly, 93 మార్చి 20-27 సంచికలో కన్నాభిరాన్ రాసిన 'Reflections on Koyyuru' (దీని తెలుగు అనువాదం అరుణతారలో వచ్చింది.) దీన్ని రాసింది N. రవి. Hyd city APCLC Unit]

— మూలం : యన్. రవి

అనువాదం : కె. సోము

పరిశీలన :

# నీలిమేఘాల పలకరింపు

గతంలోని, వర్తమానంలోని నీలినీడలు కదలాడిన మన అనుభూతులనూ, ఆవేశాలనూ, అభిమానాలనూ సృజిస్తూ, మనలోకి ప్రవేశించిన కవితా ఝరి మన మనస్సులూ, శరీరాలూ ఓడ్చిన కన్నీటి ధారలివి. తల్లి ఒడిలో తనువు దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చిన హృదయ భారాలివి. మనలోని రహస్తంత్రులనుమీటి స్వర్శానురాగాలు నిషిద్ధమై రాజీవనాల్లో బతుకు కోసం నిరీక్షిస్తున్న గాయాలివి. ఇన్ని వున్న ఆ 'నీలిమేఘాలు' మనవి. మనందరి ఎడారి ఎదల్లో కురిసిన అమృత బిందువులివి. వాటిని జాగ్రత్త చేసుకోవడం మన అవసరం.

మనది కాని, మనకందని, కాలాన జానెడు జాగాలేని ఈ విశాల విశ్వంలో అర్ధభాగం మనం. అర్థమేలేని ఈ అర్ధభాగం తన కలం విప్పి, గళం విప్పి, తన అర్థాన్ని తెలుసుకుంటున్న వైనమిది. "నేపుట్టినట్టు అమ్మ కలగన్న పాపానికి, తిండి లేకుండా కృశింప చేసినపుడు నేననుకున్నా" "నేనొక నిషిద్ధ జీవినని" "నేనొక స్త్రీనని" అని తెలుసుకుంటున్న స్త్రీలంతా 'శ్రీమతి' హృదయాన్ని పంచుకుంటున్నారు. పుట్టడమే హీనమైన స్త్రీలు, పుట్టి సాధించిందేమిటయ్యా అంటే, బాల్యంలోనే తల్లులయి, పదేళ్ళకే వందేళ్ళ అనుభవాల చేదు గుర్తులయిన చోట "మా అమ్మ నవమాసాలు మోసి, కన్నపిల్లడికి ఇప్పుడు నేనే తల్లిని" "రోజంతా తమ్ముళ్ళను మోసీ మోసీ," "శాపవిమోచనలేని ఆడపిల్లనై, ఏడేళ్ళకే పిల్లకి తల్లినై", మనందరి సాక్షిగా పెరుగుతున్న చిన్నారి తల్లుల ఘోషలివి. పల్లెల్లో దళితుల వ్యవసాయ కూలీల, పట్టణాల్లో, మురికివాడల్లో కుటుంబాలలో బాలింతలు సహితం 'రెక్కాడితే గాని, డొక్కాడదని' కోట్ల కుటుంబాలలోని పరిస్థితులివి. తల్లులు పనిలోకి పోతే, ఆ ఇంట పెద్దపిల్ల ఆ పిల్లలందరికీ తల్లి కావాలి. అక్కడ నవనవ లాడుతూ పిల్లలు పెరిగే అవకాశమే లేదు. మరి ఆ పరిస్థితులకు కారణ మేంటి ? ఎలా వాటిని మార్చుకుందాం ? ఈ "తల్లి కాని పిల్లల తల్లి" — ఎప్పుడు అక్షరాన్ని, జ్ఞానాన్ని నేర్చుకుంటుందో, తన ఉనికి కష్టమైన స్థితిని ప్రశ్నిస్తుందో 'అంజన' చెప్తే బావుండేది.

బాల్యం వీడి యవ్వనంలోకి అడుగిడటం ఎంత మధురం ! అందుకోసం

ఎంత ఎదురు చూస్తారు పిల్లలు. లేత సాయం సంధ్యాకాలాల్లో, పచ్చిక బయళ్ళలో, చెరువుగట్లపై పికిలి పిట్టల కిలకిలారావాలేననుకుంటారు. దాటీ దాటని బాల్యంలో, యవ్వనం కోసం ఎగబడే రోజుల్లో, రంగుల హరివిల్లులను దర్శించాలన్న కాంక్షలతో ఉరకలెత్తే మనకి హఠాత్తుగా 'వైయక్తిక పర్వతం నిశ్శబ్దంగా విస్ఫోటనం చెందినపుడు' "అత్యవసర అస్పృశ్యంగా మిగల్లేక" బాధ పడుతూ 'కె. గీత'తో మన మూసాలు పంచుకుందాం. అప్పటిదాకా ఆడుతూ, పాడుతూ వున్న మనలను, రజస్వల అవటమే అన్ని అనర్థాలకూ మూలమన్నట్లు ఇనుప కట్టడాల్లోకి నెట్టి వేస్తారు. "శిల్పీకరించని మహాకావ్య విషాదాలు" మన జీవితాల్లోకి ప్రవేశిస్తాయి. ప్రకృతి ధర్మమైన శారీరక మార్పుని గమనించక, మన శీలానికి కవచం కట్టడం ప్రారంభిస్తారు. మాట, మనసూ, నవ్వూ, నడక అన్నీ నిషేధాలమధ్య. సాము గరిడీల్లో బ్యాలెన్స్‌డ్ తీగపై సాగవలసి వుంటుంది. మన సమాజం పరువు విలువ మన అంగరక్షణపై ఆధారపడివున్న స్థితిలో కొండేపూడి నిర్మలతో పాటు మనమూ సెల్ఫ్‌పిటీ పిడికిలి విప్పాలి". ఈ సమాజం యొక్క ఓటితనం మీద సమ్మెట పోట్లు వేయాలి పట్టణాల్లో నవనాగరికతల్లో బతుకుతూ, 'రజస్వల' కార్డు వేయించి, "పద్మా"ల్లో కూర్చోబెట్టే సంస్కృతి ఎక్కువవుతోంది. పల్లెల్లో సహితం చిమ్మిరి కొక్కి, కొబ్బరి చిప్పలు పంచి, మా అమ్మాయి ఇక వరుడికోసం రెడీ అన్న ప్రకటన లాగా, పేరంటాలు చేస్తూవున్న ధనిక వర్గ సంస్కృతి క్రిందీ దాకా పాకుతుంటే మనమేం చేద్దాం ? దీనివెనుక వున్న మౌఢ్యమేమిటి, మతమేమిటి ? మూలాలేంటి ? వాటిపై కాదా మన రణభేరి ? మనకిది వైయక్తిక దుఃఖమేనా ? మనందరి బాధల్లో భాగంగా చూడండే "యవ్వనాల చుట్టూ దడి కట్టిన వరాయీకరణల భద్రతా రాహిత్యాల" సవాలక్ష సందేహాలనెలా ఎదుర్కొంటాం ?

దాంపత్యాలలోని "యథార్థాల యాంటిక్లయిమాక్సులను చూసిన ఘంటసాల నిర్మలకు "చేజార్చిన కలల పట్టుదారాల కోసం, కళ్ళు వెక్కిళ్ళు పెడతాయి" కానీ పాటిబండ్ల రజని "రాజీవనాల"తో పదహారు చేతుల బాక్సింగ్‌లో తలదూర్చే సాహసం ఏ రిఫరీకి లేకపోయినా, అవసరాల వేదిః అసహనాన్ని ఢీ-ఫ్రాస్ట్ చేయడం మొదలౌతుంది. ముసి ముసి నవ్వులు ముత్యాలై జారతాయి. మార్గాల దాంపత్యాలయినా రాజీవనోత్సవాలు జరుగుతాయి. స్త్రీ, పురుషుల కలయిక అనంతరం వాస్తవ ప్రపంచంలో వారిమధ్య వుండే ఎడం, దర్శనమిచ్చి మనస్సు గాయమవుతుందంటే,

రజని "ఆక్రోపసుల్లా పోట్లాడుకున్నా, శ్వేతకపోతం రెక్కలు రెపరెపలాడతాయ"ని చెప్పింది. ఇద్దరూ ఎలా చెప్పినా, దాంపత్యాల్లోని డొల్లతనాన్ని విప్పారు. అయితే ఆ దాంపత్యాలలా తగలబడటానికి ఏ సంస్కృతి మూలంగా వుంది ? ఆ సంస్కృతిని ఎలా ఎదిరించాలి ? భార్యాభర్తలమధ్య సంబంధాలు బాగుపడటానికి మిగిలిన ఏ సంబంధాలు పని చేస్తాయో తెలుసుకోవాలి. భర్త మంచివాడై, మనం చెప్పినట్లు వించే పరిపోతుందా మరి ? దీన్ని ఆలోచించాలి. భార్యాభర్తల మధ్య లేని ప్రజాస్వామ్య సంబంధాలు, ఏ ఆర్థిక, సామాజిక పునాదులమీద నిర్మించబడి వున్నాయో తెలుసుకోవాలి. మన బాధల పాటల పల్లవి ఏ చరణాలతో కలిసి పాడాల్సి వుంటుందో ఆలోచించుకోవాలి.

తల్లి, మాతృమూర్తి అనే పదాలు ఈ సమాజం చెప్పే మాయాజాలమే. ఆ పదాల చుట్టూ వున్న ఇంద్రజాలమే మనలను పాలిస్తోంది. అయితే మరి మనం "ఆ తల్లి మానం పాత బట్ట పిగిలినట్లు పిగులుతుందని" పిల్లల్ని కనటం మానేద్దామా ? స్త్రీకి మాతృత్వమే పరమావధి కాకపోయినా అది తేలిగ్గా తీసేసే అంశమూ కాదు. ప్రకృతి సహజంగా మన శరీర నిర్మాణమది. నిజంగా మనం దానిని తిరస్కరించటమూ అంటే, సామ్రాజ్యవాదుల కుట్రలకు బలై పోవటమే. కృత్రిమ గర్భాలు, గర్భంతో పనిలేని కృత్రిమ వాతావరణంలో మానవుల జన్మలను కాసిస్తున్న కాలమిది. మనకు సహజంగా వున్న ఈ సహజాతపు హక్కును, వారు కూలదోయాలని, మన "Mother Right" మీద వాడి కంట్రోలు కోసం చేస్తున్న ప్రయత్నాలను మనం తిప్పికొట్టాలి. దుర్మార్గంగా ఈ సమాజం మనలను నాశనం చేస్తుంటే, తిరిగి మనం అదే ప్రమాదంలోకి నెట్టబడటమేమిటి ? కక్కుతారనీ, పేరుగుతారనీ ఒకరు చెప్పాల్సిన పనిలేదు. ప్రతి తల్లీ ఈ మాత్రం తెలుసుకుంటుంది. మహాకవులు చెప్పేది అర్థం కాకుండా ప్రపంచాన్ని మాయాజలతారులో కప్పటానికి, కక్కులూ, పేరుగుడులూ ఎవరికి తెలియనివని ? వీటికోసమే మనకు, మాతృత్వం వద్దనుకుంటే, మన పేరుగులు ఎత్తి, మన పీతిగుడ్డలుతికి, మన బంగ్లాలు తుడిచి, మన ఎంగిలి కంచాలు ఎత్తిన వారే మనుకోవాలి ? వాళ్ళకి అది జీవితాంతమూ వుండే పనే కదా ? "నేమ దుద్దీ దుద్దీ మెరిపించిన దొడ్లలో నువ్వు ఉచ్చపోస్తే" నాజూకుగా కత్తిరించి, పరిపూర్ణంగా తయారు

చేసిన నా శరీరాన్ని చేరుకుని" వాడు ఫోజులు కొడుతుంటే "చంపాలని వుంది, రక్తాన్ని రుచి చూడాలని వుందనుకుంటే," వీరంతా ఏమనుకోవాలి ? ఎవర్ని చంపాలి ? తమ శ్రమఫలం దక్కనివారు మన సౌందర్యాలమీద తిరగబడితే, మన బంగ్లాలు పగలగొడితే, అందుకోసం వారికి పలుగులిద్దామా ? పారలిద్దామా ? మరి, మన ఆరాటాలు పోరాటాలూ దేనికోసం ? ఈ సమాజపు మూసల్లో ఊపిరాడక గిల గిల కొట్టు కొంటున్నామని ఆక్రోశించటం మనొక్కరి కోసమేనా ? మనందరం, మన లాంటివారంతా మనసులున్న మనుషులుగా మసలటంకోసం. దానికోసం ఏం చేద్దామో, ఆలోచించుదాం.

"ఒక హింసాతల, పరాకాష్ట కోసం, ఎదురుచూద్దాం" 'నిండునెల్ల గర్భిణి ఒక్కో బొట్టు చొప్పున మొత్తం ప్రాణం ఇచ్చుకోవడానికి" వస్తోన్నమాట, ఎంత నిజం ! కొండేపూడి నిర్మలగారి 'లేబర్ రూమ్'లో, ఇంకా ఇంకా లేబర్ రూమ్‌ని, ఆ నరకాన్ని చెప్పాల్సింది చెప్పలేదనిపిస్తుంది. "కాళ్ళనలా ఎడంచేసి దీనంగా, హీనంగా నీచాతి నీచంగా' నేనా, మన బాధలకు అక్కడ వున్నవారి వెక్కిరింతలు, హేళనలో ? నిజంగా మన 'లేబర్ రూమ్' లకు ముఖ్యంగా ప్రభుత్వాసుపత్రులకు వెళ్ళే, నిరుపేద అభాగ్యులు ఎన్ని మాటలు పడతారో, అక్కడి నరకం చూస్తేనే గాని, చెప్తే అర్థమయ్యేదికాదు. అయితే దాన్నుండి కూడా మన పిల్లలు వద్దని గుణపాఠం తీసుకోలేం. అందుకే వాణీరంగారావుగారి 'తరతరాల శత్రువు'తో ఏకీభ వించలేకపోతున్నా. "నువ్వు నాలోంచి వచ్చిన శతృవర్గపు మొలకవని" మన చర్మా భాగమైనచోట, మనం ఎవరిని నిందిద్దాం ? ఇక్కడే మహెజబీన్ 'నవస్మృతి'ని తలచుకుందాం. "మనకు మాత్రమే కల్పించబడిన ఆ వరం ఎందుకు వదులు కోవాలి...." "గుండె చప్పుడు కడుపులో వినిపించే అద్భుతాన్ని సొంతం చేసు కోవాలి...." అందుకే "ఈ యుగం ముందు నిలబడి మాతృత్వాన్ని ఆవిష్కరిస్తు న్నాను'ను ఆహ్వానిద్దాం.

"ముసలివెతలు భరించే ఓపికెక్కడిది" "కడుపుకింత రాల్చి, కృతజ్ఞత చూపించటమే మనకు తెలిసని 'తరాల అంతరాలను, రావులపల్లి సునీత 'అమ్మ అలిగింది'లో చెప్పారు. ఈ వేగం, డబ్బు మయమైన ప్రపంచంలో ఒకర్ని, ఒకరు ఓదార్చుకునే తీరికేది ? అందుకే ఏ వయసు వారికి ఆ వయసువారు కావాలనేది,

దానికి అడా, మగా లేదు. అగాధాన్ని దాటటమే ముఖ్యం అంటుకే "అమ్మకు 'నాన్న' లేడు, అమ్మ వేదనను పంచుకోడానికిప్పుడు అమ్మకు మా 'నాన్న' లేడు" అని తలమకుంటోంది.

మొత్తం సంకలనం ఆర్తిగా వుంది. ప్రతివారూ వారి వ్యక్తిగత అనుభవాల నుండి రాశారు. ఆ 'చిత్తడి' ప్రతి కవితలో కన్పిస్తుంది. అయినప్పటికీ ఒకమాట చెప్పకోక తప్పదు ఇన్ని కవితల్లోనూ ఎంతో బాధను వ్యక్తం చేశారు. కానీ ఎక్కడ దారీ, తెన్నూ చూపించలేదు. స్త్రీలు తమ గురించి తాము తెలుసుకుని, ఏమి చేయాలో తెలియక, శూన్యంలో నుంచుని, దిక్కులు పిక్కటిల్లేలా ఏడ్వాలన్నమాట. వాళ్ళకు మనమేం A.K 47 లు ఇవ్వనక్కరలేదు, అయితే మాత్రం ఒక్క పిసరంత ధైర్యమిచ్చిన కవితేదీ, 'వి. పద్మావతి' 'గాయనద్ద సనిముట్టు' తప్ప ? "వెక్కిరింతగా నిలిచిన వీర్యపు చుక్కల్ని ఒక్క ధిక్కారపు చీత్కారింపుతో బహిష్టుస్రావంలా తుడిచెయ్యలేక"—అని తన మీద జరిగిన అత్యాచారానికి క్రుంగిపోవద్దని ధైర్య మిచ్చింది. మన బాధల నుండి మనం కమ్యూనికేషన్ ఏర్పరచుకోవచ్చు కానీ ఆ కమ్యూనికేషన్ అగమ్యగోచరంగా వుండకూడదు.

అలా వున్నట్లయితే "ఆత్మహత్య నా నిరసన"లే వస్తాయి. సతీసహగమనపు రోజుల్లో, భక్తి ఉద్యమపు రోజుల్లో అశక్తురాలయిన స్త్రీ తన నిరసనను తెలిపినట్లు, మహిళా ఉద్యమాలు విప్లవోద్యమాలు వూపేసే తొంభైయవ దశకంలో రావులపల్లి సునీత పరిష్కారం బాగా లేదు. నిజంగా దీనిని సమర్థించటమంటే "నీలిమేఘాల" సంకలన సందర్భమే అర్థంకేదు. ఇది సంఘటిత శక్తిమీద నమ్మకంలేని, వ్యక్తిగత బాధల పరాకాష్ఠ పర్యవసానం. తప్పకుండా వ్యక్తి అనుభవాలు ఆ వ్యక్తుల జీవితాల్లో ప్రధానమైనవే. అందుకే మనిషికి 'చైతన్యం' ముఖ్యమని చెప్పటం. అది మనిషిని నిలుపుతుంది. తన బాధలనుండి, మిగిలిన సమాజాన్ని విశ్లేషించుకునే శక్తి నిస్తుంది. అటువంటి చైతన్యం సంతరించుకునే సందర్భంలో మనం వుండి, 'ఆత్మహత్య నా నిరసన'—నిరసించదగ్గది.

తప్పకుండా మనందరం ఆలోచించాల్సిన విషయం రజియాబేగం 'అలాగే అన్నారు'. "కూర్చుని కూర్చుని బద్దకం వచ్చినందుకే బాధగా వుంది". ముఖ్యంగా మధ్యతరగతి స్త్రీలు, ఇళ్ళలో వుండటానికి, కుటుంబాల భద్రతను వదులు కోవటా

నికి సిద్ధంగా లేరు. వారికి కుటుంబాల భద్రత ఎంతో బావుంది. ఈ బావుండటం అలవాటయ్యింది. దీన్ని మనం ఎలా ఎదుర్కోవాలి ? మహిళా సంఘాలుగా, కొంత మంది దగ్గరకు వెళ్తే, చివరికి ఉద్యోగం చేస్తున్న స్త్రీలు కూడా, మాకేం సమస్యలు లేవు లెండి, అని మనల్ని, ఏమీ పనిలేని వాళ్ళుగా చూడటం జరుగుతోంది. ఈ అనుభవాలు రజియాబేగం చెప్పిన 'బద్ధకం'లో నుండి వచ్చినవే. ఆలోచించటానికి బద్ధకం, భయం. మరి దీన్నెలా ఎదుర్కోవాలి.

మరి ఇన్ని మాట్లాడుకున్నాం. మరి ఏం చేద్దాం ? ఎవరి మీద యుద్ధం చేసి గెలుపొందుదాం ? "వర్గ శత్రువు నా శ్రమనే దోచుకుంటాడు, ఈ దుష్ట శత్రువు నా బ్రతుకే దోచుకుంటాడు" అని మొక్కపాటి సుమతి "మిత్ర వైరుధ్యమా" ? లో ప్రశ్నిస్తున్నారు. ఇది యాదృచ్ఛికంగా మాట్లాడిన విషయం కాదు, ఒక సిద్ధాంత నేపథ్యం నుండి వచ్చినది. జీవితం నుండి సిద్ధాంతాలు వస్తే ఆచరణలో ఉపకరిస్తాయి. పురుషుడితో కలిసి బతుకుతాం, పెంచుతాం, కాని వాడు శత్రువు. ఇదేం వైఖరి? ఇది పురుషులను ద్వేషించటం కాదుగాని, స్త్రీలకూ నష్టదాయకమైన అంశమని గుర్తించాలి. బరిగీసి మనిద్దరం కొట్టుకుందాం. పిల్లి తీర్పు పిల్లి చెప్తుంది. పోనీ శత్రువో, మిత్రువో యుద్ధమే చేద్దాం. ఆ యుద్ధం ఎట్లా చేద్దాం ? మన శత్రువును మనం కలుపుకోకూడదు కదా, 'సుధ' చెప్పినట్లు "మన యుద్ధం మనమే చేసుకుందాం". "మన రక్తంతో, మన మూలికతో మన కత్తి దాలు మనమే చేసుకుందాం." మన బదులు వాడు చెయ్యొద్దు. అయినా నీకోసం నీవు చేసుకునే యుద్ధంలో వాళ్ళ కలవనే వద్దా ? దళితుల యుద్ధం దళితులు, స్త్రీల యుద్ధం స్త్రీలే చేసుకుంటారు. పోనీ దళితులైనా కలవొచ్చా ? లేదా ? మన యుద్ధంలో. మన శత్రువు ఎంత బాగా మనల్ని మాయ చేయగలుగుతున్నాడో గదా !

వసంతా కన్నాభిరాన్ చెప్పినట్లు వర్గాలకు, వర్ణాలకు, చివరికి 'ప్రిజుడీస్'లకు కూడా అతీతమైంది కాదు సాహిత్యం. సాహిత్య చరిత్రంతా పురుషాధిపత్య భావజాల సాహిత్యమే. కనుకనే, స్త్రీల వర్ణనలన్నీ శారీరక వర్ణనలే, అదీ పురుషుకి కంటి కింపైన, అందమైన ఉన్నత వర్గ, వర్ణాలకు సంబంధించినవారే. కాయకష్టంచేసే నల్లగా, తుమ్మ మొద్దుల్లాగా వుండే స్త్రీలు వీళ్ళ కళ్ళకూ, కలాలకూ కూడా కనిపించ

లేదు. కాని ఇవ్వాళ స్త్రీలు, వారి కోసం వారు రాసుకుంటున్నారు. కనుకనే గర్భస్రావాలు చేయించుకుంటం వెనుక ఈ మందుల మంత్రాలను చెప్పుకుంటున్నారు పిల్లలు వద్దనుకుంటే, స్త్రీలే నెలవారీ బిళ్ళలు మింగాలి. పురుషుడికి ఏ మాత్రం బాధ కలిగేవి కావు. అవే ఎందుకు సైన్సు తయారు చేసింది ? పురుషులు ఆపరేషన్ చేయించుకుంటే మగతనం పోద్దని, స్త్రీలే కుటుంబ నియంత్రణ లెందుకు చేయించుకుంటున్నారు ? వెన్నెముక నొప్పులొచ్చీ, హార్మోన్ల తేడాలతో, కీళ్ళనొప్పులు, చీకాకులు ఎక్కువయి, ఎందుకు ద్వేషింప బడుతున్నారు ? ఇదంతా 'జెండర్' అసమానతలో భాగమే. దీనిని ప్రశ్నించాల్సిందే. అదే సమయంలో గ్రామాల్లో పేద దళితులు మైనారిటీ ముస్లింలు ఇంకా, 'చెట్టుకి కాయ బరువా' ? అని సంతానమే తమ ఆస్తులుగా తలుస్తున్నారెందుకు ? మెజారిటీగా వున్న ఈ స్త్రీల నెలా మార్చాలి ? ఇదీ కూడా ప్రశ్నే. ఒక అభద్రత నెదుర్కోవటం కోసం, మరో పెట్టుబడిదారుడికి పునరుత్పత్తి శ్రమని చవగ్గా అమ్ముకోవాల్సి వస్తోంది. ఈ వాస్తవం ఎలా మర్చిపోదాం ? ఇది ఒకదానికొకటి ముడిపడివున్న విషయాలు. మనం విడిగా కొన్ని సమస్యలనే చూడలేని స్థితిలో వున్నాం. స్త్రీల పునరుత్పత్తి అవసరాలేమిటి ? పునరుత్పత్తి అయ్యేది మానవులే కదా ?, ఆ మానవుల అవసరాలు స్త్రీల అవసరాలు కాదా ? స్త్రీగా పునరుత్పత్తి సాధనంగా మన ప్రత్యేక అవసరాలు గుర్తించాలి. దాన్ని డిమాండ్ చెయ్యాలి. అయితే అవి మాత్రమే సమస్యలుగా భావించటం సరైంది కాదు.

మనం 'ఏ హైరార్కీ'లు, సమాజాన్ని విభజించి పాలిస్తుందని చెప్తున్నామో ఆ 'హైరార్కీ'లలో మనం పడవద్దు. స్త్రీలంతా ఏకం కావాలి. అందరి బాధలా ప్రతిధ్వనిద్దాం అప్పుడే మన సగం మన కవుతుంది. కనుక స్త్రీలంతా ఏకం కావటానికి ఏం చెయ్యాలి. గ్రామీణ, పట్టణ, ఉన్నత, పేద వర్గాల స్త్రీల నెలా కలుపుకు రావాలి ? ఈ కలుపుకు రావటంలో 'వర్గ' ప్రభావాలెటువంటివి ? స్త్రీలలో వున్న ఈ హైరార్కీల నధిగమించే ప్రయత్నం చెయ్యాలి. అప్పుడు మాత్రమే మన విముక్తి సాధ్యం. దానికి ఈ సంకలనం మొదటి మెట్టని భావిస్తున్నాను.

— నల్లూరి రుక్మిణి

## కామ్రేడ్ అరుణ్‌సన్యమత్ అమర్ రహే!

అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ అరుణ్ సన్యమత్ కలకత్తాలో గుండెపోటువల్ల హఠాత్తుగా మరణించారు. పశ్చిమ బెంగాలుకు చెందిన విప్లవ రచయితల, మేధావుల, కళాకారుల సంఘం (RWAIA) ఏర్పాటులోనూ, నిర్వహణలోనూ విశేష కృషి చేసి, దాని పత్రిక “సంఘతి”కి బాధ్యత వహించారు. స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్ట్ శాఖలో చిన్న ఉద్యోగం చేస్తూ వచ్చిన అరుణ్‌సన్యమత్ ఏ. ఐ. ఎల్. ఆర్. సి. కార్యవర్గ సభ్యుడుగా చిరకాలం పనిచేసి, తన నిష్కపటత్వంవల్ల అందరి ప్రేమాభిమానాలకు పాత్రులయ్యారు. బెంగాలీభాషలో కవితలెన్నో రాశారు. ఆయన మరణం ఎ. ఐ. ఎల్. ఆర్. సి. కి పెద్ద దెబ్బ.

—కె. వి. ఆర్

విరసం విశేషాలు :

# 27-2-94న విజయవాడలో విరసం కార్యవర్గం చేసిన తీర్మానాలు :

## 1. నెల్లిమర్లలో నెత్తురుకూడు :

విజయనగరం జిల్లా నెల్లిమర్ల జనపనార మిల్లు యాజమాన్యం కొన్ని దశాబ్దాలుగా కార్మికులను దోచుకుతింటూ తెగబలిసిపోయింది.

కార్మికవర్గం తన న్యాయ సమ్మతమైన కోర్కెల కోసం చైతన్యంతో కదల గానే యాజమాన్యానికి వెన్నులో వణుకు పుట్టింది. వెంటనే పాలకవర్గ రాజకీయ నాయకులతో, పోలీసు యంత్రాంగంతో షరీకై కార్మికుల మీద పీడన మొదలు పెట్టింది. IFTU నాయకత్వాన కా॥ ప్రసాద్ సారథ్యంలో కార్మికులు మరింత కట్టు దిట్టంగా యాజమాన్యాన్ని ఎదిరించి నడుం కట్టి పోరాడారు. యాజమాన్యానికి గంగ వెర్రులెత్తి మిల్లును మూసేశారు. యిది అన్యాయమని కార్మికులు శాంతియుతంగా మిల్లు ముందు ధర్నా చేశారు. కానీ యాజమాన్యం తన సహజధోరణిలో కార్మికుల మీద కాల్పులు జరిపించి నాలుగు నిండు ప్రాణాలను పొట్టన పెట్టుకుంది. యాజ మాన్యం పైశాచికరినీ, పోలీసు కాల్పులనీ విరసం తీవ్రంగా ఖండిస్తోంది. కార్మికుల కోర్కెలన్నింటినీ ఆమోదించాలనీ లాకౌట్ ఎత్తి వేయాలనీ విరసం డిమాండ్ చేస్తోంది. చనిపోయిన కార్మికుల కుటుంబాలకు న్యాయమైన నష్టపరిహారం చెల్లించా లనీ విరసం డిమాండ్ చేస్తోంది.

నూతన ఆర్థిక విధానం, IMF, వరల్డ్ బాంక్, డంకెల్ ఈ నాలుగు పడగల కింద భారత ప్రభుత్వం తన పబ్బం గడుపుకుంటోంది. అందుకు తిరుగు లేని తార్కాణం నెల్లిమర్ల కాల్పులే. ఈ సంగతి గ్రహించి కార్మిక వర్గానికి బాసటగా నిలబడాలని ప్రజాతంత్రవాదులకి విరసం ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తోంది.

## 2. సు.రా.కి విరసం జోహార్లు :

విద్యార్థి దశ నుంచీ సాహిత్య సెలయేరుగా ప్రవహిస్తూ వివిధ పుద్యమాల్లో శాగడాగా వెలుగొందిన సి.వి. సుబ్బారావు జనవరి 17న గుండెపోటుతో ఢిల్లీలో చనిపోయారు.

స్పష్టమైన సైద్ధాంతిక అవగాహనతో నిర్దిష్టమైన నిర్మాణ పద్ధతుల్లో నిరంతరం పాటుపడిన బుద్ధిజీవి సుబ్బారావు.

భారతదేశంలోని జాతుల సమస్యను అధ్యయనం చేసి వెలుగు రేఖలు విరజిమ్మాడు సు.రా. సామాజిక శాస్త్రాల అధ్యయనాన్ని, సాహిత్యోద్యమానికి మేళవించి విశాల సంధ్యలు ప్రచురించాడు సు.రా. నానాటికి పెరిగిపోతున్న రాజ్యహింసను సకాలంలోనే పసిగట్టి 15 ఏళ్ళుగా ఢిల్లీలో పౌరహక్కుల ఉద్యమానికి నేతగా వుంటూ, ఢిల్లీలో అందరికీ తల్లో నాలుక అయ్యాడు సు.రా. సాహిత్య సాంస్కృతిక రంగానికి, పౌరహక్కుల ఉద్యమానికి సురా మృతి తీరని లోటు, అతని అవిరళ కృషిని విరసం సగర్వంగా స్మరించుకుంటున్నది. అతని కుటుంబ సభ్యులకు, విరసం తన ప్రగాఢ సానుభూతినీ, సంతాపాన్నీ తెలియజేస్తున్నది.

## 3. ప్రజా సంఘాల సదస్సుపై దాడి అమానుషం :

కరీంనగర్‌లో – "ప్రజాస్వామ్యము, రాజ్యము, అణచివేత" అనే అంశం మీద ప్రజాసంఘాలు నిర్వహించిన సదస్సుపై ప్రభుత్వం, పోలీసులు సాగించిన దమనకాండను విప్లవరచయితల సంఘం ఖండిస్తోంది.

విరసం కార్యవర్గ సభ్యురాలు, POW స్త్రీ విముక్తి అధ్యక్షురాలు అయిన కా॥ విమలతో పాటు, స్త్రీ విముక్తి నాయకురాలు సంధ్య, తదితర స్త్రీలపై పోలీసులు సాగించిన అసభ్యమైన దాడి ప్రజా ఉద్యమాల పట్ల ప్రభుత్వ ఫాసిస్టు వైఖరిని నగ్నంగా బయటపెడుతుంది.

ప్రజా ప్రతినిధులపైన, పత్రికా విలేఖరులపైన కూడా దాడి చేయడంతో ప్రభుత్వం తాను చెప్తుంది నిజంగా బూటకపు ప్రజాస్వామ్యమని తానే రుజువు చేసుకుంది.

సంఘటనపై విచారణకు పోలీస్ ఆఫీసర్లను నియమించి విచారణ జరిపించడం హాస్యాస్పదంగా వుంది.

ప్రజా ఉద్యమాలపై సాగుతున్న దాడులను ఆపాలని, ప్రజలపై విధించిన నిర్బంధాన్ని ఎత్తివేయాలని, కరీంనగర్ సంఘటనపై దోషులను కఠినంగా శిక్షించాలని విప్లవ రచయితల సంఘం డిమాండ్ చేస్తోంది.

## 4. హంతకుడు రుద్రజ్వాల విరసం సభ్యత్వం రద్దు :

ఇంచుమించు ఇరవైయేళ్ళ నుంచి విరసం సభ్యుడుగా ఉన్న రుద్రజ్వాల (వెలుగు వెంకట సుబ్బారావు) తన రెండో భార్య నాగమణిని అతిహీనంగా అను మానించి తీవ్రమైన మానసిక క్షోభకు గురిచేసి అడుగడుగునా చిత్రహింసలపాలు చేశాడు. అక్కడికీ తనివితీరక 3-2-'96న క్రూరాతిక్రూరంగా ఆమె మెడకు ఉచ్చు బిగించి చంపేశాడు. ఇంతాచేసి దానిని ఆత్మహత్యగా చిత్రించాలని కుయుక్తులతో, పన్నాగాలతో ప్రయత్నించాడు. విరసం ప్రకాశం జిల్లా యూనిట్ సభ్యులు చొరవతో వాస్తవాలను పరిశీలించి నిగ్గుతేల్చి అతణ్ని హంతకుడుగా గుర్తించి, కార్యదర్శి అతణ్ని విరసం నుంచి తొలగించారు. అతని తొలగింపును విరసం కార్యవర్గం ఏకగ్రీవంగా ఆమోదించింది.

అటు భూస్వామ్య భావజాలం, పురుషాధిక్యత, ఇటు పరాయీకరణ, వ్యాపార సంస్కృతి ఇవాళ మానవులను నికృష్టజీవులుగా మార్చేస్తున్నాయి. అన్ని రకాల దుష్టప్రభావాల నుంచి సమాజాన్ని విముక్తి చెయ్యడానికి కంకణం కట్టుకున్న వి.ర.సం. ఆచరణలో ఉన్నతమైన విలువలను పాటించవలసి ఉంది. అలాంటి నూతన విలువలను ఏ మాత్రం పాటించకుండా, ఇన్నాళ్ళుగా రుద్రజ్వాల వి.ర.సం చాటున దాక్కోగలిగాడు. విరసంను వంచించాడు. సమసమాజ నిర్మాణం కోసం తమ నెత్తుటిధారలతో ఒక వైపున విప్లవకారులు కొత్త రహదారులు వేస్తున్నారు. వారికి వాసటగా నిలబడ్డ విరసం ఉన్నత సామాజిక విలువలను నిరంతరం పరి రక్షించుకుంటూ ఉండాలి. సమాజాన్ని మార్చడానికి కంకణం కట్టుకున్న మనం కూడా ఎంతో మారాలి. ఈ సందర్భంలో విరసం సభ్యులందరికీ వి.ర.సం మరో సారి విప్లవ విలువలను గుర్తు చేస్తోంది. ఈ సందర్భంలో విరసం నిశితమైన ఆత్మవిమర్శ చేసుకోవాలని కార్యవర్గం నిర్ణయించింది.

నిత్య జీవితంలో కూడా విప్లవలాంటి నిజాయితీ నెత్తికెత్తుకుని నడవాలనీ నూతన సామాజిక విలువలకు మనమందరం బాధ్యత వహించాలని విరసం మరో సారి విజ్ఞప్తి చేస్తోంది.



81?

గల్పిక :

# "రాజ్యాధికారం"

"ఏమోయ్ ! మీ నిమ్న కులాల వాళ్ళందరూ ఒకటవ్వాలనుకుంటున్నార . దేనికోసం ?"

"ఢిల్లీలో అధికారం కైవసం చేసుకోవడానికండి"

"భారుణమోయ్. ఇలా కులాల పేరుతో మీరు జనాన్ని సమీకరించడం నేర."

"అయ్యా, ఇప్పటికే మీ అగ్రకులాల వారు ఐక్యమై ఉన్నారు గదా ! ప్రభుత్వమంతా మీదే గదా !"

"మాలో ఐక్యత ఎక్కడ ఉందోయ్."

"ఇప్పటిదాకా అధికారంలో ఉన్నదెవరండీ ?"

"మేమే !"

"ప్రతిభను ధనంతో కొనగల సత్తా ఎవరికుందండీ ?"

"మాకే"

"సౌకర్యాలు, సంఘంలో గౌరవాలు, సంపదలు ఎవరిసొత్తండీ ?"

"మావేనయ్యా, అంతేగాదోయ్ గ్రామాల్లో పెత్తనం మాదే. ఎన్నికల్లో ఖర్చు పెట్టే ధనం మాదే, మీ ఓట్లన్నీ వేసేదీ మేమే, వేయించేదీ మేమే. ఇంకా ఫట్టి చెప్పాలంటే ఈ దేశంలో తొంభై శాతం పంటభూములన్నీ మావే. ఇవన్నీ మా చేతుల్లో ఉంటే ఢిల్లీలో పదవుల్లోకి మీరొచ్చి ఏం జేస్తారోయ్ !"

అట్లానా, అహంకారంతోటన్నా ఆలోచించే మాటన్నావ్. నిజమే ! ఢిల్లీలో తోలుబొమ్మల పదవులు కాదు మాకు కావలసింది. దున్నేవాడికే భూమి కావాలంటూ నిజమైన రాజ్యాధికారం కోసం పోరాడతాం !

"ఆం !................ !"

—ఎమ్మెస్

155 ARUNATARA MARCH, 1994 H/GTR-70
Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-

# ఒకరి కొకరు

అడవీ అడవీ
ఎక్కడిదే నీకీ యవ్వనం ?!
నా గుండెల్లో తలదాచుకునే
నా చిన్నారుల పచ్చదనాన్ని అద్దుకున్నాను కాదుటే!

ఏరూ ఏరూ
ఎట్లున్నవే నీవింత స్వచ్ఛంగా ?!
నాలో సేదతీరే
నా వీరపుత్రుల మాటల్ని కలుపుకున్నాను కాదుటే!

కొండా కొండా
ఎట్లొచ్చిందే నీకింత దృఢత్వం ?!
నిరంతరం నా ఎత్తుల్ని కొలిచే
నా ముద్దుబిడ్డల గుండె గట్టితనాన్ని నింపుకున్నాను కాదుటే!

వెన్నెలా వెన్నెలా
ఎందుకుందే నీలో ఇంత చల్లదనం ?!
నన్ను దీపంగా చేసుకున్న
నా జాబిలి కూనల కళ్ళనుండి కురుస్తున్నాను కాదుటే!

గెరిల్లా గెరిల్లా
ఎలా కలిగింది నీ కింత ఆత్మవిశ్వాసం ?!
నన్ను ఆప్యాయంగా అక్కున చేర్చుకునే
ప్రకృతి చలన సూత్రాల అధ్యయనం నుండే చెల్లెలా!

— లారిస్సా

Printed at Nagendra Press, VJA-2 on behalf of Venkataramana Printers, Guntur-1. Revolutionary Writers' Association.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M110 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumathi |
| పేజీలు విడదీసినది | Bhanu Sree |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |